

ద్వితీయ సంపుటము.

# గ్రంథాలయ సర్వస్వము.

ద్వితీయ సంచిక.

## శేష చైత్రము

ఇగురు పుట్టిండ్లలో♦ నెదిగిన చెలిమి
కొమ్మల యొడులలోఁ♦ గులికిన కలిమి,
వృద్ధవనస్పతులలో♦ మొలగిన చెలిమి
పై శాఖమును జూచి♦ వదలెదే చైత్ర!

౨

పూల కాగిండ్లలో♦ నోల లాడితివి,
సరసుల పొత్తులో♦ సఖ్యమాడితివి,
పసిపైరగాలిలో♦ పరువు లాడితివి,
మంచు టెండల నిని♦ మానెదే చైత్ర!

3

రమణుల చరణాల♦ రాచిన లాత్తు,
అబలల యధరాల♦ నంటిన తమ్మ,
కన్నెల నుదురుల♦ కందిన చాదు
ఎన్నాళ్ళు మరిపెమో♦ యెఱుఁగుదే చైత్ర!

౪

కోయిల పాటలోఁ♦ గోమలస్వరము,
మలయమారుతములో♦ మధురవాసనలు
కలికి పూగుత్తిలోఁ♦ గమ్మనిమధువు
అనుభవింతెందాక♦ నందాలచైత్ర!

౫

పత్రాలు, రాల్చితి♦ పచ్చనిచెట్ల,
జీవనశ్వాసమ్ముఁ♦ జేర్చితి నదుల,
పనిపాట లాకలఁ♦ బరిపితి పిండ్ల,
చాలదే నీపాలి♦ భయమింకఁ జైత్ర!

౬

సస్యపాతమున భూమి♦ సగపించినావు,
సుఖగాత్రుఁ ప్రజలను♦ సోలించినావు
పగలు దీర్ఘములుగాఁ♦ బాటించినావు
చాలవే నెల్లెల్ల♦ చక్కనిచైత్ర!

కష్టమో సౌఖ్యమో♦ గడపితి విచట
నీతోంచి కాలంబు♦ నీటుగో టెగయ,
దుఃఖింప కవసాన♦ దురవస్థ కిపుడు,
కాలచక్రము నాప♦ గాలేము చైత్ర!

౮

సనసన లాడెడి♦ చిగురాకు లెల్ల
కటుకెక్కు నెండ కా♦కలు బోలె ముదిరి,
సర్వవాలుకములు దు♦స్స్వప్నములై రేగ
నిప్పులుగ్రక్కుచు,♦ నెయ్యంపు చైత్ర!

౯

నీ సౌఖ్య సంపదల్♦ నీ భోగరుచులు,
గ్రీష్మన కిట్టు ల♦ర్పింపఁగా వలసె
నంచు నాకులపడ♦ కవసానచైత్ర!
ఉదయాస్తమయతత్వ♦ మిదియె నమ్మిలను.

—రాయప్రోలు సుబ్బారావు.

# ఆంధ్రభాష

ఆంధ్రులవలనను ఆంధ్రదేశమందును వాడఁబడుభాష ఆంధ్రభాష. పూర్వమే తెగవారే దేశమందు నివసించియుండిరో ఆప్రదేశమునకు ఆతెగవారి పేరే వ్యవహారమునకు వచ్చినది. పూర్వమునందు నట్టిప్రదేశములకు స్థిరములైన హద్దులులేక ఆయాతెగవారు స్వాధీనపఱచుకొని ఆక్రమించుకోఁగలిగిన ప్రదేశమంతయు నాపేరుచేతనే వ్యవహరింపఁబడుచు వచ్చినది. ఆంధ్రరాజులు అరణ్యప్రాయమగు నీదేశము నాక్రమించుటచే దీనికిఁ గూడ నాంధ్రమని పేరువచ్చినది. ఆంధ్రులు ప్రప్రథమమున మగధదేశమును పరిపాలించినట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. మనపూర్వులచే లెక్కింపఁబడుచు మనపురాణములలో నక్కడక్కడ వాడఁబడుదేశములలోని ఆంధ్రదేశమదియేకాని ఇదికాదు. ప్రస్తుతము మనము నివసించుచు మనచే నాంధ్రదేశమని వ్యవహరింపఁబడు ప్రదేశము పూర్వము మహారణ్యప్రదేశముగానున్నట్లు పెక్కు నిదర్శనములు కలవు. గంగానదీ సాగరసంగమమయిన ప్రదేశము మొదలు కృష్ణానదివఱకును పూర్వము కళింగదేశమని వాడబడుచుండునది. ఇది మూఁడుభాగములుగా విభజింపఁబడి ఉత్తరకళింగమనియు, మధ్యకళింగమనియు, దక్షిణకళింగమనియు వ్యవహరింపఁబడుచు మొత్తముమీఁద త్రికళింగదేశమని వ్యవహరింపఁబడుచు వచ్చినది. ఆంధ్రులచే ప్రప్రథమమున నాక్రమించుకోబడిన ప్రదేశము కొంచెమించుమించుగా కృష్ణాగోదావరీ మధ్యప్రదేశమై యున్నట్లు తోఁచుచున్నది. తరువాత త్రికళింగదేశములో దక్షిణమధ్యమకళింగలు వేఁగీపట్టణము రాజధానిగాఁగల రాజులపరిపాలనలోనికి వచ్చి వేఁగీదేశమని వ్యవహరింపఁబడుచు వచ్చినను, త్రికళింగదేశ తద్భవమగు తెలుఁగుపదము మాత్రము దీనిని వదలలేదు.

తరువాత నాంధ్రదేశమును తెలుఁగుదేశమును నొక రాజు పరిపాలనలోనికి వచ్చినతరువాత దానికిని దీనికిని గూడ తెలుఁగుదేశమనియు నాంధ్రదేశమనియు వ్యవహారము వచ్చినది. అంతేకాని ఆంధ్రమనునది సంస్కృతభాషాపదమనియుఁ దెలుఁగు దానికి తెలుఁగనియు ననుకొనుట ప్రమాదమని నాయభిప్రాయము. తూర్పున మహేంద్రపర్వతము, దక్షిణమున ద్రాక్షారామము, పశ్చిమమున శ్రీశైలము, ఉత్తరమున కాళేశ్వరము,—ఈహద్దుల మధ్యస్థమగు ప్రదేశము తెలుగుదేశమనియు నాంధ్రదేశమనియు వ్యవహరింపఁబడుచున్నది. ప్రతాపరుద్రమహారాజున కంకితమీయఁబడిన ప్రతాపరుద్రీయములో విద్యానాథమహాకవి శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామనివాసులగు దేవతల పేర్కొనుటగూడ నీయంశమునే స్థిరపఱచుచున్నది. కావున నీయెల్లలమధ్యస్థమగు ప్రదేశమున మాటలాడుభాష తెలుఁగనియు నాంధ్రమనియు ప్రస్తుతము వ్యవహరింపఁబడుచున్నది. రఘువంశములో రఘుదిగ్విజయవర్ణనావసరమున కాళిదాసును, రాజతరంగిణిలో ప్రవరసేనాది దిగ్విజయవర్ణనావసరమున కల్హణపండితుండును మహాభారతమున నర్జునదేశయాత్రాప్రస్తావమున వ్యాసమహర్షియు నరణ్యమగుటచే వర్ణింపక వదలిన యీప్రదేశము, నన్నయభట్టునాటికి జనపదాలంకృతంబై యుండుటంజేసి సంస్కృతమున లేకపోయినను నర్జునయాత్రాప్రస్తావమునం దీప్రదేశమును వేఁగిదేశముగా నన్నయభట్టు వర్ణించినను—దీనికి వేఁగిదేశమను వ్యవహారముగాని యీభాషకు వేఁగిభాషయను వ్యవహారముగాని రాలేదు. సరిహద్దులలోనున్న అరవము, కన్నడము, కళింగము, మొదలగు భాషల సంపర్కమువలనను నార్యసంతతిలోనివారును సంస్కృతభాషాప్రవిష్టులునగు పండితులకు నివాసభూమియగుట వలనను ఈ మన యాంధ్రభాష క్రమక్రమముగా నాగరకభాషావస్థకు వచ్చినదగుటచే నానాభాషాపదములన్నియు నిందుఁ జేరినవి.

ఈభాషయందు ప్రస్తుతము వ్యవహరింపఁబడు పదములలో నరవభాషాభవములు, కన్నడభాషాభవములు, కళింగభాషాభవములు, సంస్కృతభాషా భవములును

వేఱుచేసినచో నాంధ్రదేశ్యపదములుచాల తక్కువగాను ననాగరికావస్థఁ దెలుపునవిగాను నుండకమానవు. ఈభాషకును మున్నె కవిత్వదశయందును వ్యవహారదశయందును మిక్కిలి యౌన్నత్యము పొందియున్న ద్రావిడ కళింగ కర్ణాటకభాషలలోనికే యాంధ్రదేశ్యపదములు చేరినవి యనుట అంతసమంజసమైనదిగను విశ్వసనీయమయినదిగను గాన్పింపదు. ఇట్లు ప్రాతివేశికభాషాపదములచే క్రమక్రమాభివృద్ధమగుచున్న మనయాంధ్రభాష చాలకాలమువఱకు సంభాషణావస్థయందే యుండి క్రమముగాఁ బండితభాషయగు సంస్కృతమునకున్న సుఖోచ్చారణముగల యక్షరసమామ్నాయమే దీని కక్షరసమామ్నాయముగా నేర్పఱుపఁబడినను దేశ్యమగు భాషను సంగ్రహించుటకు మాత్రము 36 అక్షరములు మాత్రమే చాలియుండెను. పండితభాష సంస్కృతమగుటచే వారు మాటలాడునపుడుపయోగింపఁబడుచు వచ్చిన తత్సమపదములకొఱకును, వారుపయోగించుపదములు సరిగా నుపయోగింపలేక యతిక్రమించి వికృతిపూర్వకముగా స్త్రీబాలపామరజనులచే నుచ్చరింపఁబడు తద్భవపదములకొఱకును సంస్కృతామ్నాయమునందున్న యన్ని యక్షరములును స్వీకరింపవలసివచ్చినది. దేశ్యపదములు కూడ పామరులచే నుపయోగింపఁబడవలసివచ్చినప్పుడు కొంచెము వికృతిగా నుచ్చరింపఁబడుటచే దేశ్యభవములగు పదములుగూడ మెండైనవి. లేఖనములేక శిక్షితముకాకయున్న యేభాషయును నిట్టివికారవేషము వహింపకమానదనుట సర్వజనవిదితమేకదా! ఇట్లక్షరసమామ్నాయమేర్పడినపిదప వ్రాయను చదువను నేర్చిన మనవారు రాజకీయవ్యవహారములయందును కొన్ని శాసనములయందును మాత్ర మీభాషనుపయోగించుచు వచ్చిరి. కాని ధర్మశాస్త్రములు, నీతిశాస్త్రములు, ప్రకృతిశాస్త్రములు, రసశాస్త్రములు, మున్నగునవి సర్వదేశవిద్వద్భాషయగు సంస్కృతమునందే రచింపఁబడుచు వచ్చినవి. ఇంతేల నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానమందు క్రియావిధానమున కుపయోగింపఁబడు సంభాషణకూడ సంస్కృతమునందే వ్యవహరింపఁబడుచు వచ్చినది. దీనికి యింకొకకారణముకూడ కలదు. మాటలాడుభాష మార్పుజెందు స్వభావము కలదియగుటచే మతవిషయికమగు కర్మలయందేమి వికృతిచెందునోయని ఎన్నడును మార్పుచెందని సంస్కృతమునందే ఆక్రియావిధానమంతయు నున్నయది. ఇఁక సంభాషణావస్థలోనున్న భాష ప్రతిమనుష్యునందును భిన్నమై కొంతయుఁ బ్రతి గ్రామమునందును భిన్నమై కొంతయు, ప్రతిదేశమునందును భిన్నమై కొంతయు నుండుటచే దేశ్యమనియు గ్రామ్యమనియు నింద్యగ్రామ్యమనియు తద్భవమనియు తత్సమమనియు నైదుభేదములు కలిగియుండెడిది. ఇతరభాషాభవములు ఇతరభాషాసమములుకూడ నున్నను సంస్కృతభాషాప్రావీణ్యముకల యప్పటిపండితులవి గుర్తింపలేక యట్టివన్నియు దేశ్యములేయనియు సంస్కృతమునుమాత్రమే గుర్తింపఁగలుగుటచే తద్భవతత్సమపదములలోనున్న తత్ అను పదమునకు సంస్కృతమనియే యర్థమునుఁ జెప్పఁగలిగిరి. కాని దేశ్యపదములయందు నైదుము ఇతర భాషాభవములు నితర భాషాసమములు నుండుటచేతను గ్రామ్యపదములయందు దేశ్యభవసమములుండుటచేతను నింద్యగ్రామ్యపదములయందు గ్రామ్యభవములుండుటచేతను తద్భవతత్సమపదములయందలి తత్పదమునకు సంస్కృతమని మాత్రమే చెప్పుటకు వలనుపడదు. ఇంతేల మ్లేచ్ఛరాజపరిపాలనము వచ్చినతరువాత తద్భాషాభవములు తద్భాషాసమములుకూడ కొన్ని మనభాషయందు సంక్రమించినవి. కాబట్టి మొట్టమొదటినుండియు తద్భవపదములను తత్సమపదములను చేర్చుకొను నలవాటుగల మనయాంధ్రభాష యాంగ్లేయభవములను యాంగ్లేయసమములను చేర్చుకొనుటకు వెనుదీయుట భాషాహానిహేతువుగాని భాషాభివృద్ధిహేతువుకాదు. కొందరు యింతవఱకున్న మనభాషలోలేని యాంగ్లేయపదములు తీసికొనవలయునుగాని యున్నపదములు తీసికొనరాదని వాదించుచున్నారు. కాని యది యుక్తిసహముకాదు. దేశ్యపదములున్నను ఆయర్థమును బోధించు తద్భవతత్సమపదములను నన్నయభట్టారకాదులు పరిగ్రహింపలేదా! చూచు ధాతువుండగా వీక్షించుధాతువు పరిగ్రహింపఁబడలేదా! అట్లని యావదాంగ్లేయపదములు నాంధ్రభాష

లోఁ జేర్పవలయునని నాయభిప్రాయముకాదు. ఏపదార్థమును వచించు పదములులేవో యెక్కుపదములచేఁ జెప్పఁబడు నభిప్రాయములు యేయొక్కపదముచే చెప్పఁబడునో ఏపదములు శాస్త్రసంకేతికములో—అట్టివియెల్లను నిశ్శంకముగా జేర్చుకోవలయునని నాయభిప్రాయము. నీచజాతులవారు మాటలాడు నింద్యగ్రామ్యమునకుగూడ వ్యాకరణము లేకపోలేదు. వాండ్రును ఏకవచనమునకు బహువచనము, కర్తకు కర్మ, కర్మకు క్రియ, షష్టికి తృతీయ, తృతీయకు పంచమి మాటలాడరు. కాని ఆపదములు వర్ణాగమవర్ణలోపవర్ణవ్యత్యయాదులచే వికృతములైనవగుటచే ప్రయోగార్హములయినవి కావు, నుత్తమజాతి నాగరకభాషలోఁ గలుపఁదగినవియు కాకపోవుటచే నింద్యగ్రామ్యములుగా పూర్వులే నిషేధించినారు. కాని యుత్తమజాతి నాగరకపండితులు స్వేచ్ఛగా మాటలాడుభాషనుగూడ దానివలె ప్రయోగార్హము కాదనుటకంటె తప్పుపని యింకొకటిలేదు. భిన్నభిన్నసీమలయందుండు నుత్తమజాతినాగరక పండితులు మాటలాడుభాషయు భిన్నభిన్నముగా నుండుటంజేసి యది గ్రాంధికముచేసినచో నొకసీమలోని వాడుకభాష యింకొకసీమలోనివారి కర్థముకాదు. కనుక వాడుకభాష గ్రాంధికతావస్థకు తగదనుకారణమే ఆభాష గ్రాంధికావస్థకు తేదగినదని చెప్పుటకు కారణము. ఏమన అట్లు గ్రాంధికావస్థకు తెచ్చుటచేతనే యది యెల్లసీమలవారికిఁ దెలియునుగాని తేకున్నంతకాలము యేసీమలోని దాసీమలోనే యుండును. ప్రస్తుతము గ్రాంధికావస్థఁజెందిన యితరదేశ్యపదములు మనకుఁ దెలియుటకు కారణము గ్రంథములేకదా! అట్లు తెలిసికోదగిన యితరదేశ్యపదములు మనగ్రంథములయం దెన్నెన్నో కలవు. ఒక్కొక్కసీమయందలి వ్యావహారికభాష యొక్కొక్కతీరుగానుండును. అందును ఒక్కొక్క తెగవారి సంభాషణ మొక్కొక్కతీరుగా నుండును. అయినను నుత్తమజాతి నాగరకపండిత సంభాషణముమాత్రమతిస్వల్పభేదములతో నొక్కతీరుగనేయున్నది. అట్టిసీమలయందలి నాగరక సంభాషణభాష యంతయు గ్రాంధికభాషయైనచో క్రమముగా సర్వసీమలసంభాషణభాషకును నైక్యము రాగలదు. అట్టిభాషయందు వ్రాయఁబడిన గ్రంథములు చదివినకొలది నీచజాతిసంభాషణభాషయు నుత్తమజాతిసంభాషణభాషాపదశైలి పొందును. సర్వసీమలలోని వాడుకభాషలు సర్వసీమలవారు గ్రంథములయందు వ్రాయగలిగరేని అప్పుడు దీనికిఁగూడ మంచివ్యాకరణముపుట్టును. అప్పుడు ప్రాచీన నవీనభాషలు రెండింటికి నైక్యము సంఘటించును. దానిచే నున్నయాంధ్రభాష కితోధికోన్నతావస్థ ఘటించును. లేనిచో సంస్కృతభాషవలె నాంధ్రభాషయు మృతావస్థలోనికివచ్చుటకు సందియములేదు. ఇతరభాషాసంపర్కముతో నభివృద్ధిచెందుచున్నంతమట్టు కేభాషకును సంపూర్ణవ్యాకరణముపుట్టదు. ఏభాషయందుగాని వ్యాకరణము భాషను నిర్బంధపరచినచో అది మృతభాషయగునే కాని యమృతభాష కానేరదు. భాషయభివృద్ధియైనకొలది వ్యాకరణముకూడ నాభాషకభివృద్ధమగునో అదియే అమృతభాష. ప్రస్తుతము తెలుగుభాషకున్నయల్పవ్యాకరణముచే సంభాషణభాషాపదము లనేకము లపభ్రంశములని తోచకమానవు. పదములేకావు శైలియంతయు నపభ్రంశప్రాయమే. అదియంతయు సుష్ఠమై ప్రక్రియాభాగముమాత్రము దుష్టమనట యేమి న్యాయము! కావున నభివృద్ధియగు భాషకెన్నడును నిర్ణీతవ్యాకరణము పనికిరాదు. అభివృద్ధియగుచున్న శరీరమునకు చిన్నతనము నాటి చొక్కాయములు పనికిరావు. క్రొత్తక్రొత్తచొక్కాయములు శరీరపరిమాణము ననుసరించి కుట్టింపవలసినదే. అందరును విద్యావంతులు కావలయునని కోరు నీకాలంబున నిర్బంధప్రాథమికవిద్య యవశ్యమని పోరు నీసమయంబున సులభశైలిగల వ్యావహారిక భాషాగ్రంథములు కాక యేగ్రంథములు పనికివచ్చును! చిన్నతనమునుండియు కర్ణతాడితమగుచున్న భాషకాక యింకేభాష సులభముగా తెలియును! పండితసంభాషణభాషలో గ్రంథములువ్రాయుట కారంభించినచో నవి తక్కువజాతిలో అక్షరములు నేర్చినవారు చదువుకొని పండితవ్యావహారికభాష నేర్చుకొనగలుగుదురు. అదియు వచ్చినతరువాత ప్రౌఢభాష నేర్చుకొందురు. ఇట్లు క్రమక్రమముగా భాషాపర్వతము నెక్కుట

కు మెట్లుండవలెను. వాడుకభాషలలో గ్రంథములు వ్రాయ మొదలుపెట్టిన పూర్వభాష నశించుననుకొనుట వెఱ్ఱితనము. భాషయందు ప్రౌఢత అలవాటుపడిన వెనుక నెవ్వఁడును తక్కువ అవస్థకు రాఁడు. ఉన్నతావస్థలోనికివచ్చినవాఁడెవ్వఁడును నీచావస్థలోనికి రాఁడుగదా?

నన్నయభట్టుకు పూర్వమం దెటువంటి గ్రంథములున్నవో లేవో మనము నిర్ణయించుటకు వీలు కనుబడుటలేదు. కాని నన్నయభట్టే తెలిసినంతవఱకు ప్రథమాంధ్రకావ్యకర్తయని యూహింపవలసి యున్నది. ఇతఁడు సంస్కృతభాషలోనుంచి తద్భవరూపముగను తత్సమరూపముగను వాడుకలోనుండిన భాషనంతయు గ్రాంథికముచేసెను. సంస్కృతేతర భాషాతద్భవములు సంస్కృతభాషేతర తత్సమములు దేశ్యములుగానే యూహించెను. నన్నయభట్టుకు పూర్వమందున్న ఆంధ్రభాషాశాసనములలో దేశ్యములే కన్పించుచున్నవి. కాని సంస్కృతభాషాభవములు సంస్కృతభాషాసమములు నున్నట్లుతోఁచదు. సంస్కృతభాషాపండితులైన వారు మాటలాడు వాడుకభాషలో సంస్కృతపదములు దొర్లుచు యేరూపములను పొందినవో ఆరూపములే మంచిపదరూపములని నన్నయభట్టు ప్రయోగించినాఁడు. అంతియెకాని సంస్కృతము తత్సమమైనప్పుడు గాని తద్భవమైనప్పుడుగాని యిట్లుండునని చెప్పు వ్యాకరణమేదియు లేదు. దానికి వాడుకయే ఆధారము. వాడుకను పట్టియే ఆపదములు నన్నయభట్టు గ్రాంథికములుగా నన్నియు ప్రయోగించినాఁడు. నన్నయ పూర్వమందున్న శాసనములలో ఇంచుతోఁ గూడిన సంస్కృతధాతువులు కానరావు. అట్టి ఇంచుధాతువుతోఁ గూడిన సంస్కృతపదము లుపయోగించుటలో నన్నయ్యకు వ్యవహారమే ఆధారముగాని యింకొక ఆధారమేదియు కానరాదు. నన్నయభట్టయినను దేశ్యపదములు ఎక్కువగా ప్రయోగించకపోవుటకు కారణము వాడుకలోనున్న సంస్కృతపదములన్నియు గ్రాంథికములుగాచేయు తలంపేగాని మఱియొకటి కాదు. తరువాత తిక్కన్నవరకు కవులు నన్నయనే ఆదర్శముగా నుంచుకొని అతఁడు తద్భవ తత్సమములను చేసిన విధముగా తద్భవ తత్సమములను చేసి ప్రయోగించుచు వచ్చిరి. కాని నన్నయమాత్రము వాడుకలోనున్న తద్భవ తత్సమపదములనే ప్రయోగించెను గాని స్వతంత్రించి తద్భవతత్సమ శబ్దములను చేయలేదు. ఈవిధముగా నన్నయచేసిన ప్రయత్నమునను అతని ననుసరించిన యితరకవుల ప్రయత్నమునను సంస్కృతభాషనంతను తెలుగులోనికి తీసుకొనివచ్చి తెలుగుగా మార్చుటచే తెలుగభివృద్ధికి కారణమైనను దేశ్యపదప్రయోగము తక్కువగుటచే దేశ్యభాష నశింపజొచ్చినది. అక్కడక్కడ దేశ్యధాతువులు ప్రయోగించినను తఱుచు పదార్థవాచకములగు దేశ్యపదములు నన్నయశకమందు కాన్పింపవు. వాడుకలోనున్నవి కావున దేశ్యక్రియలు మాత్ర ముపయోగింపక తప్పనివయ్యెను. తిక్కన్న మహాకవి ఆంధ్రదేశోత్పన్నుఁడగుటచేత తనకవిత్వమందు శక్యమైనంతవఱకు పదార్థవాచకములగు దేశ్యపదములే యుపయోగించెను. కాని వ్యాకరణమునకు మాత్రము నన్నయభట్టునే ఆదర్శముగా చూచుకొనెను. తరువాత మారన కేతన ప్రభృతులు తిక్కన్ననే అనుసరించుచు తఱుచు దేశ్యపదములే ప్రయోగించుచు వచ్చిరి. కేతననాఁటికి తెలుగుప్రయోగములే శరణములుగాని వ్యాకరణము మాత్రము లేదు. అప్పుడు ప్రయోగము లెంతపర్యంతమున్నవో అంతమట్టుకు వ్యాకరణము వ్రాసెను. నన్నయభట్టు వాడుకలోనున్న "ఏడ" అను పదమును ప్రయోగించినను కేతన్న కాసంగతి తెలియక "ఏడ" గ్రామ్యమని వ్రాసినను, ఇతరకవులు ఆపదప్రయోగము మానలేదు. దానిచే వాడుకే బలముగానున్నదిగాని వ్యాకరణము బలమైనది కాదని తేలుచున్నది. తరువాత శ్రీనాథాదులు పెద్దపెద్ద సంస్కృతభాషా పండితులగుటచే సంస్కృతభాషనే తెలుగుగా వాడుచు వచ్చిరి. రానురాను దేశ్యపదములు నశించి తద్భవ తత్సమరూపమైన సంస్కృత భాషయే తెలుగుగా మారినది. ప్రస్తుతము దానికితోడు ఇంగ్లీషు భాషకూడ కొంతకలియుటచే నానాటికి సంస్కృతపదములు, ఇంగ్లీషుపదములు తప్ప తెలుగుపదములే నశించును. కావున వాడుకలో ప్రజలు మాటలాడు పదము

లుగూడ గ్రాంధికములు కావలెను. దానిచే ఆంధ్రభాషాపదములు పెక్కులు పైకివచ్చును. లేనిచో నిఁక కొన్ని సంవత్సరముల కాంధ్రభాష నామావశిష్టమైన దగుటకు సందియములేదు. విభక్తులు కాక ఆంధ్రదేశమున సాధారణముగా ప్రజల వాడుకలోనున్న పదములన్నియు గ్రాంధికములు కావలెను. అట్టిపదములు కొన్ని పరిణామములుపొంది ఉచ్చారణశైధిల్యముచే అపభ్రంశములుగానుండుట తటస్థించినను వానిని సంచిదశలోనికి తీసికొనివచ్చుటకు ప్రయత్నించవలెను. గ్రంథములలో మనము వాడినచో దాని యథార్థరూపము బయటనే పడును, లేదా అదియే దానికి రూపమగును. దానవలన నేమియు భాషకు లోపము రాదు. పదమనునది పదార్థమును తెలియజేయుసంజ్ఞగాని వేరొకటికాదు ఏపదమెట్లున్నను దానివలన పదార్థము తెలియవలెను. ఏపదమువల్ల నిస్సంశయముగా పదార్థము తెలియునో అదియే సాధువగును. ఇక వ్యాకరణము దానిని సర్వదేశము లోకవిధముగానే వాడుట కుపయోగించును. అట్లుకానిచో ఎవరిష్టమువచ్చినట్లు వారు మాట్లాడుటయు దానివలన పదార్థము తెలియకపోవుటయు తటస్థించును. ఏపదమును ఒక్కరీతి పెక్కుమంది వాడుదురో అది సాధువైనపదమే. దానిని సాధించు వ్యాకరణము లేకపోయినను యున్నట్లే. కనుకనే శబ్దసిద్ధి లోకంబువలన తెలియునని చెప్పఁబడియున్నది. నన్నయభట్టుఁడు సంస్కృతవ్యాకరణము ననుసరింపవలసిన వాఁడైనను "ద్రుపదపురంబున కరుగునది" "పయనంబు పోవువారు" "వానికిట్లనియె" "బృహస్పతికిచ్చె" "నీవిఘ్నవచనంబులకు వెఱచుటెట్లు" "అని యరచుచున్న దానికి యనఘుండు కరుణించి" "వానికనియె" "నీ పరాక్రమంబునకు మెచ్చితి" "మానవులకు విశిష్టులమై" "హయంబులు సాధనంబు" "ఒరులచేఁ గొనఁగనొల్ల" "వేదవేదాంగ పారంగుండైన భారద్వాజశిష్యుండ" ఇది మొదలయిన పదములయందు లోకమున ననుసరించియే ఒక కారకమున కింకొక కారకము ప్రయోగించెను. దీనికి లోకమట్లు వాడుచుండుటయే కారణముగాని వేఱుకాదు. తరువాత ఆప్రయోగముల ననుసరించి వాడుకలో నిట్లున్నదని గ్రహించి చిన్నయసూర్యాదులు తగిన వ్యాకరణములు వ్రాసిరి. అట్లే ప్రస్తుతము వాడుకలోనున్న ఆంధ్రభాషకుఁగూడ వ్యాకరణము వ్రాయుటకు వలనుపడకపోలేదు. చూడుడు భావార్థమునందున్న "చేయుట" అను పదమునకు మారుగా "చేయడము" అనురూపము వాడుకలో నున్నది. ఈరూపము అన్ని ధాతువులకు నిట్లే మారియున్నది. దానికి డప్రత్యయము అంత్యమున కకారాదేశము విధించుకొందుము. భాష పుట్టిన తరువాత వ్యాకరణము పుట్టునుగాని వ్యాకరణము భాషను పుట్టింపదు. ఒకరీతిగా కొన్ని పదములు వాడుకలో నుండుటఁజేసి బుద్ధిమంతులు దానికి తగిన సూత్రములు కల్పించినచో మన మెఱిఁగిన కొన్ని పదముల నా సూత్రమే సాధించును వాడుకనగా అనేకమంది పదసౌష్టవము మెఱిఁగిన విద్వాంసులు వాడుటగాని వ్రాయుటగాని ఎవరో ఒకరిద్దరు వాడుట వాడుకకాదు. "వచ్చేవాడు" "ఆనేవాడు" "వెళ్లేవాడు" "ఉండేవాడు" ఈ పదములు తద్ధర్మార్థకవిశేషణోకారమునకు ఏకారము వచ్చును అని సూత్రమున్నట్లు మనము గ్రహించగలిగితిమేని సాధువులని గ్రహింపవచ్చును. దీనికి అజాదిపదంబులు పరంబగునపుడు టుగాగమము వచ్చును, అని గ్రహించిన "వచ్చేటప్పుడు" "అనేటప్పుడు" "వెళ్లేటప్పుడు" "ఉండేటప్పుడు" అను రూపములు సిద్ధించును. ఉకారాంతములైన "చేయు" "నేయు" "పోయు" "కోయు" మొదలయిన ధాతువులకు క్త్వార్థకమునందు సకారము వచ్చినట్లే తద్ధర్మార్థకవిశేషణమునకు గూడ సకారము వచ్చుటచేత "చేసేవాడు" "నేసేవాడు" "పోసేవాడు" "కోసేవాడు" ఇత్యాది రూపములు సిద్ధించును. దీనివలన ఒక రూపమునకు రెండురూపములుండుట తటస్థించునుగాని భాషకేమి లోపముకలదు! ఇంతకుమున్ను మనము సాధుపదము లనుకొనుచున్న పదములలో "చేయుచున్నాము" "చేయుచునున్నాము" అని రెండురూపము లుండుటలేదా! మఱియు నీ ప్రాకృతాంధ్ర భాషలో పూర్వాంధ్ర భాషచే రాజాలని యర్థముగూడ వచ్చుచున్నది. "వస్తాడు" దీనికి తప్పక వచ్చునని భవిష్యదర్థము బోధ్యమగుచున్నది. దీనికి

కాలత్రయమును బోధించు "వచ్చుఁ" అను పదమే కదా ఉపయోగింపవలసినది. అట్టి అర్థమును నిస్సంశయముగా బోధించు శబ్దమొకటి పండితులచే వాడఁబడుచున్నప్పుడు, అన్ని ధాతువులకు నట్టి సజాతీయరూపమే యున్నప్పుడు, దానికొక వ్యాకరణము వ్రాయుటకనువైయున్నప్పుడు, అది అపభ్రంశపదమెట్లగును! మఱియు అకారాంతమైన పదములయందలి నకారము లోపించి తత్పూర్వ కాకారమునకు దీర్ఘము వచ్చుచున్నది. "చేసినఁ" "వెళ్ళినఁ" "తిట్టినఁ" "కొట్టినఁ" "చేసినా" "వెళ్ళినా" "తిట్టినా" "కొట్టినా" దీనివలన నకారాంతములనిగూడ తెలియుటకు గుర్తగుచున్నది. మఱియు సముచ్చయార్థకారములకు "న్నీ" ఆదేశము వచ్చుచున్నది. "చేసిన్ని" "కొట్టిన్ని" "తిట్టిన్ని" మఱియు నీ నకారద్వయముమీది యచ్చు దాని పూర్వాచ్చు ననుసరించి మారుచున్నది. "వాడున్ను" "వీడున్ను". విశేష్యమగు తదర్థక "వాడు" పదములోని వకారమునకు లోపంబును ఆకారంబునకు అనునాసికాకారంబును తత్పూర్వాచ్చునకు లోపంబును వచ్చును. "అనుభవించాడు" "నిరీక్షించాడు" "నాశాడు" "వెళ్ళాడు" "పడ్డాడు". కొన్నిచోట్ల పదమధ్యోకారము నకే కాక పదాంతోకారమునకుఁగూడ లోపము వచ్చుచున్నది. "వెళ్ళాఁడా" పడ్డాఁడా" "వస్తాఁడా" శత్రర్థకమగు "చుచు" అనుదానికి "చుతు" గాని "స్తు" గాని వచ్చును. "నిరీక్షించుతు" "నిరీక్షిస్తు" "చూచుచు" "చూస్తు" ఈ "చుతు" మాత్రము ఇంచుకకేగాని అనించుకరాదు.

ఈప్రకారముగా సంస్కృతాంధ్రభాషావేదులగు పండితులచే మన ప్రాకృతాంధ్రభాషకు చక్కని వ్యాకరణము వ్రాయింపవచ్చును. ఇట్టిభాష బాలురకు పఠనీయముచేసిన మనదేశమున కపారమైన లాభము కలదు. సంస్కృత గీర్వాణభాషలోనుండి పుట్టిన ప్రాకృత గీర్వాణభాషకు మనవారు వ్యాకరణము వ్రాయలేదా? దానియందు గ్రంథములు వెలువడలేదా? ప్రస్తుతమునందు అదియు వాడుకలో లేకపోవుటచే సంస్కృతమువలెనే మృతభాషయైనది. అట్లే మన ప్రాకృతాంధ్రభాషకుగూడ వ్యాకరణము వ్రాయింపుడు. దేశభేదముచే యీభాషకూడ కొంత మార్పుచెందినను ఆ మార్పుగూడ మనము వ్యాకరణమందు సూచింపవచ్చును. మన గీర్వాణభాషయందుగూడ దేశభేదముచే రూపభేదము కలుగునని చెప్పు సూత్రములెన్నియోగలవు. ఏదైన కానిండు పెక్కు చరిత్రవిషయక గ్రంథములు, ప్రకృతిశాస్త్రవిషయక గ్రంథములు, మన బాలురకు పఠనీయములుగా చేయవలసియున్నవి. మనవారు ప్రాథమిక నిర్బంధవిద్య కావలయునని కోరుచున్నారు. స్త్రీలకు విద్యకావలయునని కోరుచున్నారు. ఇట్టి సమయంబున ప్రతిదినము కర్ణతాడితమగుచున్న భాషలోని గ్రంథములు చదువుకొని లోకజ్ఞానము సంపాదించుకోవలసి యున్నది. ప్రజాసామాన్యమునకు బోధపడవలసిన గ్రంథములన్నియు మనవారు వాడుకభాషలోనే వ్రాసిరి. శాస్త్రములకు వ్రాసిన వ్యాఖ్యానములును కవిప్రబంధములకు వ్రాసిన వ్యాఖ్యానములును కథలును పెక్కులు వాడుకభాషలోనే యున్నవి. అచ్చుకాకుండ వాడుకభాషలోనున్న వచనప్రబంధములనేకములు మనవారు వ్రాసియున్నవి. ఉభయభాషాకోవిదుడును మహాకవియునగు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు వసుచరిత్రకు వ్యాఖ్యానము ఈ వాడుకభాషలో వ్రాసిరి. ప్రజాసామాన్యమునకు విద్యవచ్చుచున్నదనుకొన్నకొలది భాషాశైలి సులభమగుచు వచ్చినది. నన్నయ్యమొదలు నేటివరకు భాష చూచిన, శైలిలో నైదారుమెట్లు కలదిగా నున్నది.

—శ్రీ కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావు
బహద్దరు జమీందారు.

# బాలుర భావిబాధ్యతలు

## (పల్నాటి వీరవాక్యము)

పడుచువారికి బుద్ధి - బలముండబోదు ;
బాలురకును దేహ - బలముండబోదు ;
యువజనుల్ సభలను - నొగిగూర్పఁదగదు ;
బాలురు సభలను - పరికింపరాదు ;
కుర్రవాండ్లకు స్వేచ్ఛ - కూడదెప్పటికి
మంచిచెడుగుణముల - మదినియోజింపఁ
దగరు నూ యువకులు ; - తథ్యమిందేల ?
బాలురెందులకును - బనికిరారనుచు;
చాటుచుందురుగాని - ఛాందసులిలను.
తథ్యమయ్యదిగాదు - దనిలియోజింప,
అది యసత్యముసుమా - యోయాంధ్రులార !

* * * *

పల్నాటిసీమను - పాలించినట్టి
యనుగుభూపతిమంత్రి - యైన బ్రహ్మన్న
సూనుఁడౌ బాలుండు, - శుభగుణాంచితుఁడు ;
గాంగేయుజన్మంబు - గాచినరాము ;
సావిత్రిప్రాణంబు - సాకినహనుము ;
ద్రోణునెదుర్కొన్న - బాలసౌభద్రుఁ,
దురకమూకలబారి - దోలుశివాజి,
బుస్సీకిభయమును - బుట్టించిమించి
వెలయు, బాలుండైన - వేంకటరావు,
యవనులనోడించి - యాంధ్రమండలిని
స్థిరతనిల్పిన కృష్ణ - దేవరాయాది ;
యోధుల, ప్రాజ్ఞుల, - సుగుణయుతుల
బోలఁగాజాలిన - పూర్వవర్తనుఁడు ;
"బాలచంద్రుండ"ను - పల్నాటివీరుఁ
డేడెనిమిదినూర్ల - యేండ్లకుమున్నె
బాలురకునుగల - భావిబాధ్యతల,
బాలురకునుగల - ప్రస్తుతార్హతల
గూర్చి యిట్టులబల్కె - కోవిదులార !

* * * *

§ "కలిదండ్రులను బ్రోవఁ - దనయుఁడే కర్త
మానాభిమానముల్ - సుగతిమిమించ
ప్రబలింపగలవారు - బాలురేసుమ్ము
బాలురె పెద్దలు - బల్లిదుల్ వారె;
బాలురకేవృద్ధి - పరికించిచూడఁ,
పెద్దలు మతిచెడి - పిరికివారుదురు ;
పాంచభౌతిక దేహ - పటుత్వ క్షీణించు
మనసు చలించును - మాటిమాటికిని
ధైర్యంబుతగ్గు ను-త్సాహంబు లుడుగు
వయసుమీరినవేళ - వచ్చునా బలిమి ?
కీర్తికైనను నప - కీర్తికైనన,
బాలురేమైనను - భాగ్యసంతతియును" §

* * * *

ఆతనివాక్యంబు - లాలించి యింక
నైన పిల్లలఁ బెంప - యత్నింతురేని,
బిడ్డలే జాతికి - పేరుదెచ్చెదరు ;
పడుచులే జాతికి - పరువుదెచ్చెదరు ;
యువకులే దేశాన - కున్నతిగూర్తు ;
రవ్వారెరాజుల - నాదరించెదరు ;
సర్వశుభంబులు - సమకూరుదాన
గాన బిడ్డల జాల - కరుణతోగాంచి
యువకులశక్తికి - నూతనోత్సంగి
సాకంగనెంచుడో - సజ్జనులార !
దేశబాంధవులార - శ్రీయుతులార !
ధర్మరక్షణులార - ధన్యాత్ములార !
కరుణాంబునిధులార - కార్యజ్ఞులార !
అభివృద్ధివాసించునో - యాంధ్రులార
విద్యాధ్యుర్యులార శ్రీ - విలసితులార !

— పైనపల్లి హనుమంతరావు.

§ ఈగుర్తులమధ్య చరణములు మహాకవి శ్రీనాథరచితములు.

# ద్వితీయ కృష్ణామండల గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ. *

## అగ్రాసనాధిపతిగారగు కోటగిరి వేంకటకృష్ణారావుబహద్దరు వారి ప్రారంభోపన్యాసము.

ఆర్యాగ్రేసరులారా ! సభ్యులారా ! ఆంధ్రకవులలో నుత్కృష్టులగు పింగళి సూరన, తిక్కన ధర్మనామాత్యుఁడు, ములుగు పాపయారాధ్యుఁడు మొదలగు మహాకవులకు జన్మస్థానమగు నీకృష్ణామండలమునుండియే ఈ గ్రంథాలయ ప్రతినిధులు సమావేశమగుటయు, బౌద్ధస్తూపములకును చారిత్రోపయోగకరములగు శాసనాదులకును నెలవగు నీజగ్గయ్యపేటలోన ద్వితీయ కృష్ణామండలగ్రంథాలయ సభ నొనరించుటయు, మిగుల నొప్పియున్నది. పండితవేష్టితమగు నీసభాస్థానమున, గ్రంథాలయములయొక్కయు భాషాస్థితిగతులయొక్కయు బాగోగులు చర్చించి వాకొనఁగల మహామహులీ సభను పలువు రలంకరించియుండ నాకీయగ్రాసనాధిపతిత్వమొసంగుట మీకు నాయందుఁగల యపార వాత్సల్యమువలననే యని తలంతును.

ఏనిందుల కనర్హుఁడనని యెఱింగియు బహుజనాభిప్రాయమునకు భిన్నముగఁ జరిగింపనోపక సాహసించి ప్రారంభోపన్యాస మొనరించుచున్నాఁడను.

### ఆంధ్ర వాఙ్మయము.

మనము ప్రకృతము చర్చింపఁబోవు నంశము ఆంధ్ర వాఙ్మయమునకు సంబంధించినది. కాన నాంధ్రభాషా స్వరూపము, ఆంధ్రభాషౌన్నత్యము, లోనగు నంశములు విచారింతము. ఆంధ్రవాఙ్మయచరిత్రము విచిత్రముగ నున్నది. ఆంధ్రభాష యింతకాలముక్రింద గ్రాంధికభాషయైనదని గాని, యాదికవి యితఁడని గాని, భాషాద్యావస్థ యిటులున్నదని గాని, వాకొనుటకుఁ దగినయాధారములు కానరావు. కాని ఆంధ్రదేశప్రశంసయుఁ నాంధ్రులప్రశంసయుఁ బ్రాచీనగ్రంథములయందు నాలుగువేలసంవత్సరములకుపైకాలమునుండి కానవచ్చుచున్నది. మహాభారతమున వ్యాసమహర్షి "ఆంధ్రాః శకాః పుళిందాశ్చ యవనాశ్చనరాధిపాః" అని యాంధ్రులఁ బ్రశంసించియున్నాఁడు. రామాయణమున వాల్మీకిమహర్షి "తథైవాంధ్రాశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాన్ సకేరళాన్" అని కిష్కింధాకాండమున నాంధ్రదేశమును బ్రశంసచేసియున్నాఁడు. దీనింబట్టి ఆంధ్రదేశము రామాయణ భారత రచనా కాలమునకు అనఁగా క్రీ. పూ ౪,౦౦౦ సంవత్సరముల క్రిందనే ప్రశంసార్హముగ నుండుటచే నాంధ్రులు ఆర్యావర్తమున చిరకాలము నుండి నివసించుచుండిరని తెలియుచున్నది. కాని యాంధ్రులందఱు నాకాలమున మనమిపుడు వాడు తెలుఁగునే మాటలాడుచుండిరనిగాని, వాఙ్మయమప్పటికే సంస్కరింపఁబడెననిగాని, ఆంధ్రభాష కప్పటికే వర్ణమాల సృజింపఁబడెననిగాని వాకొనుట కాధారములు కానరావు. ఆంధ్రవంశ్యులగు రాజులు నాగరికులై క్రీస్తుశకాబ్దమునకు మూఁడువందల సంవత్సరములకుఁ బూర్వమునుండి యించుమించుగా నాలుగైదువందలసంవత్సరములు మగధ, కర్ణాట, మహారాష్ట్ర, ద్రావిడ దేశములు పాలించిరి. వీరలకు ముఖ్య రాజ్యస్థానము మగధరాజ్యములోని పాటలీపుత్రమైనను, రెండవ రాజ్యస్థానము ఆంధ్రదేశమధ్యమున నున్న గుంటూరుమండలమునకుఁ జేరియున్న ధరణికోట. దీనినే యాకాలమున ధాన్యకటకమని ప్రాచీనులు వ్యవహరించి యున్నారు. ఆకాలమున నాంధ్రరాజులందఱు తమశాసనాదులు ప్రాకృతభాషలో వ్రాసియున్నారు. అట్టిశాసనములు ధరణికోట, భట్టిప్రోలు, ఘంటసాల లోనగుచోటులఁ గానవచ్చుచున్నవి. పిమ్మట మనదేశము పాలించిన పల్లవులు, చోళులు గూడఁ దమశాసనాదికములఁ బ్రాకృతవర్ణములతోఁ బ్రాకృతభాషలోను

* ఈ సభ ౧౯౧౭ సం. ఏప్రియలునెల ౮ వ తేదీన జగ్గయ్యపేటపట్టణమున జరిగినది.

8-4-1917

గ్వాచిత్యముగ గీర్వాణభాషలోను రచియించుచు వచ్చిరి. గీర్వాణభాషలోనున్న యాకాలపు శాసనములుగూడఁ బ్రాకృతపదభూయిష్ఠములుగాఁ గానవచ్చుచున్నవి. దీనింబట్టిచూడ వ్యవహారాదికములకు, లేఖనవ్యవహారములకు నాకాలమునఁ బ్రాకృతమే ప్రధానభాషగఁ బరిగణింపఁబడెననుట నిర్వివాదాంశము. ఆంధ్రభాష ఆకాలమున నున్నటులఁగాని భాషాస్వరూప మాకాలముననిటులున్నదనిగాని వాకొన నవకాశములు కానరావు. ఆంధ్రకవిత్వముగూడ నాకాలమున నున్నదనుట కాధారములేదు. నన్నయ్యభట్టారకునకుఁ బూర్వమున నేశాసనమందుఁగాని యాంధ్రగద్య పద్యాత్మకములగు శాసనములు కానరావు క్రీ. శ ౯౫౦ ప్రాంతములలోని యుద్ధమల్లుని శాసనమొకటి బెజవాడలో నున్నది. అది ఆంధ్రభాషలో వ్రాయఁబడియున్నదిగాని భాష యిప్పటియాంధ్రముతోఁగాని నన్నయభట్టారక ప్రయుక్తమగు నాంధ్రముతోఁగాని పోలుటలేదు. గ్రంథాంతము మధ్యాక్కరలలో నిండి కర్ణాటపదభూయిష్ఠమై యున్నది. అంతకుఁ బూర్వమందున్న యాంధ్రభాషాస్వరూపము మనకిట్టిదని తెలిసికొన సాధారములు పొత్తిగ లేవు. ప్రాచీనశాసనములలో పదియవశతాబ్దప్రాంతముల నుండి ఆంధ్రవాక్యములు హద్దులలో మాత్రము కానవచ్చుచున్నవి. అవియు మనయాంధ్రభాషతో పొత్తిగఁబోలవు. క్రీ. శ. ౧౧ శతాబ్దములోని మల్లవిష్ణువర్ధనుని ఎలిఉపల్లిశాసనములో "దక్షిణం ఉలావకలి వ్రాతిసిన్థ వబమాణందూటి దక్షిణమించి పోయి తూర్పించి అగ్ని బత్తులగట్టు పోంగా గొల్లనిగట్టుచేరి దక్షిణమించి" అని హద్దులువ్రాయఁబడియున్నవి. అసంస్కారహీనమగు భాషకు సంస్కారయుక్తమగు నిప్పటిభాషకు మిక్కిలి వ్యత్యాసము కానవచ్చుటచే రమంగమి యాంధ్రకవిత్వము క్రీ. శ ౯౦౦ ప్రాంతముల జనించెననియు, భాష అప్పటికి సంస్కారశూన్యముగ నుండెననియు రాను రాను భాష యభివృద్ధిపొందెననియు నూహింప నవకాశము కలుగుచున్నది. పూర్వము నామములుగూడ "బొడ్డియ దామపియ, పేరియ, నన్నియ, మల్లియ, మొద్దలగు ప్రాకృత సంప్రదాయానుసారములగు, ఇకారములతోఁ గూడి యున్నవి. కొన్ని శాసనములలో "ముయ్యలికుట్రు, పొలగరుసు, వబమాణం, ముయ్యలికుంట్రాన" అను కొన్ని యపరూపప్రయోగములు కానవచ్చుచున్నవి. సర్వలోకాశ్రయుని చందలూరు శాసనములో "వంగ్రిబోయాయ కొళ్ళపుఱబోయాయ, పిదెనబోయాయ, కులియిదబోయాను" అని బోయపదము బ్రాహ్మణుల కుపయోగింపఁబడినది. వంగ్రి, కొళ్ళపుఱ, పిదెన, కులియిద—యివి బ్రాహ్మణనామములు. దీనిచే క్రీ. శ ఆఱవశతాబ్దాంతమందలి యాంధ్రభాషస్వరూప మిట్టిదని తేలుచున్నది. మనకుఁ గానవచ్చినంతవఱకు నన్నయభట్టారకుఁడె కవులలో మొదటివాఁడని తోఁచుచున్నది. అంతకుమున్నాంధ్రకవిత్వము లేకపోలేదుగాని సంస్కారశూన్యముగ, నితరభాషాపద సాంకర్యముతోఁ గూడి నియమరాహిత్యముగ నుండెననియు, నన్నెచోడులు మున్నూరు క్రీ. శ, ౯౫౦ మొదలు ౧౧౫౦వఱకుండుటచేతను, భారతముకంటె కుమారసంభవము నాగరకతగాఁ గానవచ్చుటచేతను నన్నెచోడకవి నన్నయభట్టారకున కీనవాఁడనియుఁ బలువురు భ్రాంతిపడుచున్నారు.

## ఆంధ్రభాష.

నియమహీనమగు నీయాంధ్రభాషకు మొదటికవి నన్నయభట్టారకుఁడనుకొందము. భాషకు బురాణయుగము నన్నయభట్టారకుఁడు మొదలు శ్రీనాథకవివఱకనియు, శ్రీనాథకవి మొదలు కూచిమంచి తిమ్మకవి అడిదమునూరకవుల వఱకుఁ బ్రబంధయుగమనియు, ఆవలిది స్వతంత్రయుగమనియు భావింతము. పురాణయుగమునఁ గవిత్రయమువారు భాషకుఁ జేసిన మేలని ర్వాచ్యము, అనితరసాధ్యము భారతకవులు పురాణాంధ్రీకరణమునఁ జూపిన నూతనమార్గములు స్వతంత్రవృత్తులు కవితాచమత్కృతులు ననుసరించి కేతన, మారన, అనంతామాత్యుఁడు లోనగుమహాకవు లుద్గ్రంథములు వ్రాసిరి. భాషయొక్కపరిపూర్ణావస్థ శ్రీనాథునికాలమున మిగులవైభవోపేతముగ నుండెను. ఆకాలపుఁ గవులందఱు నియతి తప్పకుండ, నౌచితి తొలఁగకుండ, వాఙ్మయము చెడకుండ దేశ్యపదములు గ్రంథస్థములుగఁ

చేసి భాషను మిక్కిలి వృద్ధిలోనికిం దెచ్చిరి. ఆంధ్రభాషకు గీర్వాణసమ్మేళనము తగినంతవఱకుంచి మధురమగు మార్గముం గనిపెట్టినవారిలో నాద్యుఁడు నామతమున క్రీ. శ ౧౪వ శతాబ్దమున సుప్రసిద్ధుఁడని పేరందిన అనంతామాత్యమహాకవి. ఇతఁడు భోజరాజీయమున నూతనమార్గములు త్రొక్కి నూత్నభావములఁ జొన్పి భావనాశక్తి కవిత్వమున కెంతవఱకేయే స్థానముల నెందెందు నుండవలయునో విశదముగాఁ దెలియునటుల సవ్యమగు కథాకల్పనము తన భోజరాజీయమునఁ జూపియున్నాఁడు. ఒక అనంతామాత్యుఁడే యననేల! నన్నయ మొదలు శ్రీనాథునివఱకు భాష సలక్షణగ్రంథములతోడను, నూతన వికాసములతోడను, ఉద్గ్రంథములతోడను వెలుగుచుండెను. ఆకాలముననే ప్రబంధయుగ సూచన ఉత్పన్నమయ్యెను. జక్కనమహాకవి వర్ణనాభూయిష్ఠముగ విక్రమార్కచరిత్రము వ్రాసెను. ప్రబంధచిహ్నములు తగుమాత్రము గూర్చి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు శృంగారశాకుంతలము రచించెను. శ్రీనాథకవి స్వతంత్రపద్యరచనతోడను గీర్వాణవాక్యమయంబగు ధారతోడను క్రొత్తరీతిని నైషధ, భీమఖండ, కాశీఖండాదుల రచించెను. ఈమువ్వురు కవులు త్రోవలు తీసికొని పెద్దనాదికవులు ప్రబంధయుగ కర్తలైరి. నిజమునకుఁ ప్రబంధయుగకవులకు ధారకు శ్రీనాథమహాకవియు, వర్ణనాంశములకు జక్కనమహాకవియు, కథాకల్పనమునకుఁ బినవీరభద్రమహాకవియు మార్గదర్శకులుగఁ బ్రత్యక్షమైరి.

## ప్రబంధములు.

ప్రబంధయుగమున సర్వవిధముల మొదటివాఁడు పెద్దన. ఈయన పురాణకథలను ప్రబంధములుగ నెటులమార్చవలయునో, ఔచితి యెటుల గాపాడవలయునో, వర్ణనాంశము లెచట పెంచవలయునో, పాత్రపోషణ మెటులచేయవలయునో చక్కఁగ వాకొనునట్లు మనుచరిత్రము వ్రాసియున్నాఁడు. "అచటఁ బుట్టిన చివురుకొమ్మైన చేవ" అను పెద్దనగారి వాక్యమే యాయన యున్నత కవితానిపుణతను సూచించును. రసపుష్టికొఱకీ కవిరాజు వరూధినీప్రవరాఖ్యుల సంభాషణమునందు చూపిన స్వభావోక్తు లనితరసాధ్యములు. ఈకాలముననే "దేశభాషలందు తెలుగులెస్స" యను పవిత్రవాక్యము వెల్లడించి సంపూర్ణభావాకరమగు విష్ణుచిత్తీయము ప్రబంధముగ సంప్రదాయవర్ణనములతో శ్రీకృష్ణరాయలవారు రచించిరి. రాను రాను ప్రబంధయుగమున భాషకనేకమార్పులు కలుగ నారంభించెను. భట్టుమూర్తి శ్లేషలకు శబ్దచిత్రములకుఁ బాటుపడి ప్రబంధయుగమున కష్టపడి నూతనమార్గము తీసెను. అవలివారందఱు భట్టుమూర్తి ననుసరించి శబ్దచిత్రములకు యమకాదులకు శ్లేషలకుఁ బాటుపడసాగిరి. పింగళి సూరకవి కాలముననైననేమి, రామరాజభూషణుని కాలముననైననేమి రమారమి క్రీ. శ ౧౬౫౦ ప్రాంతములలో ద్వ్యర్థికావ్యములు బయలుదేరెను. రాను రాను త్ర్యర్థికావ్యములు బయలుదేరెను. భాషకు పెక్కుమార్పులు సంభవించెను. పలికొందఱు "౧౦౦ అవునకుఁ గావ్యపంక్తి పది యర్థములఁ రచియింప నేర్తు" నని ప్రతిజ్ఞలొనర్చిరి. అప్పటినుంచియే కవులందఱు ప్రబంధయుగమున భాషాసౌకర్యము మఱచి గీర్వాణమయముగ పద్యములు వ్రాయుచు శబ్దచిత్రములకు, శ్లేషలకు గర్భకవిత్వములకు, ఓష్ఠ్య, నిరోష్ఠ్యకవిత్వాదులకుఁ జొరఁబడిరి. కాని యీకాలమున పింగళి సూరకవిమాత్రము భాషకు ఇంతయన రాని మేలొనరించి కళాపూర్ణోదయము, రాఘవపాండవీయము; ప్రభావతీ ప్రద్యుమ్నము రచించి భాషాప్రపంచమున శాశ్వతస్థాయిగని కీర్తిశేషుఁడయ్యెను. పింగళి సూరకవివంటి మహాకవులు మఱియొకరిద్దఱాంధ్రభాషకు లభించినయెడ మనభాష సాటిభాషలకంటె యొకచేయి మిన్నయయ్యెడిని. పింగళి సూరకవి కేవల కవులందఱు కేవలవర్ణనములతోడను దీర్ఘసమాసకలితములగు పద్యములతోడను ఔచిత్యత్యాగముచేతను గ్రంథము వ్రాసి భాషాప్రపంచమున పాఱజల్లిరి. శ్లేషకావ్యములు, నిరోష్ఠ్యకావ్యములు, గర్భకవిత్వములు, సూరకవి కేవలనే బయలుదేరెను. ఆధునికులలో సుప్రసిద్ధులగు కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి లోనగు మహాకవులు కూడ ఔచితికంటె కావ్యములయందు వర్ణనములు

పట్టుదలతోఁ జేర్చిరి. ఈవర్ణనయుగమునే స్వతంత్రయుగముగ భావించితిని. పలువురు లక్షణోల్లంఘనము, గుణవిసర్జనము, రసాభాసము, కావ్యములలో కుప్పలుగాఁ గుప్పిరి. రానురాను యక్షగానములు, గుమ్మెటకథలు, వీధినాటకములుకూడ నీకాలముననే యభివృద్ధిలోనికివచ్చెను. ఆంధ్రభాష గ్రాంథికరూపముఁ దాల్చినపిమ్మట, నిటుల పూర్వోక్తక్రమముగ రూపత్రయముఁ దాల్చెను. పిమ్మట ఆంగ్లేయుల పరిచయమువలనను, క్రమప్రాప్తమగు నాగరకతవలనను మనభాషకుఁ బూర్వారిష్టములు కొంతవఱకుఁ దొలఁగినవి. గర్భకవిత్వములు, చిత్రకవిత్వములు, యమకాదులు, కవితారసభంజకములును గల కావ్యములు నశించెను. నవీన భావన యాంధ్రుల హృదయదర్పణమునఁ బ్రతిఫలించెను. భాషకు నవనవగ్రంథము లుత్పన్నములయ్యెను. గీర్వాణనాటకములకుఁ దెలింగింపులు బయలువెడలెను. రానురాను భాషపూర్వావస్థలఁదొలంగి నేఁటికి కొంతవఱకు నూతనవికాసము వహించెను. ఇప్పటికి సర్వాంగసుందరములగు కావ్యములు, భావబోధకములగు వచనకావ్యములు, పూర్వుల పవిత్రజీవితములఁ దెల్పుచరిత్రములు భాషకావశ్యకములై యున్నవి. ప్రాచీన కవుల సంప్రదాయములు వారల గ్రంథములు నేఁటికవులకుఁ గొన్నికొన్ని తావుల మార్గదర్శకములు కావలసివచ్చెను. ప్రతికవికిఁ దగుపాటి విమర్శనజ్ఞానము చరిత్రజ్ఞానము వర్తమానకాలమున నావశ్యకముగ నుండవలసివచ్చుటచే భాషాసేవకులకు గ్రంథాలయములతో నక్కఱకల్గెను. ముద్రితగ్రంథములన్నియు ప్రతికవియు సేకరించుకొనుటయు వ్యయప్రయాసలు భరించుటయు జనసామాన్యమునకుఁ గష్టముగాఁ దోఁచసాగెను. ఇట్టిపరివర్తనముగల పందొమ్మిదవశతాబ్దముననే ఎన్నిశతాబ్దములక్రిందనో యంతరించిన గ్రంథాలయములు పునరుజ్జీవితమ్ము లయ్యెను. ఈ గ్రంథాలయములలోఁ గొన్నిఁటియందు ముఖ్యముగా లిఖితగ్రంథములు శాసనాద్యాధారములు, దండెకవిలెలు ప్రోగుచేయఁబడెను. మఱికొన్నిఁటియందు ముద్రితగ్రంథములు మాత్రమే సేకరింపఁబడెను. ఇపుడు ప్రతిగ్రంథాలయము వారును విధిగాఁ బ్రాచీనకవుల కృతములై మాలుమూలలఁబడి నామరూపములులేక నశింపనున్న యాదికవుల లిఖితగ్రంథములఁ బ్రచురింపఁదగిన యవసరముకలిగినది. జనసామాన్యమునకు భాషయం దభిమాన మభివృద్ధి నొందసాగెను: కావుననే ఐక్యకంఠ్యముగ మనము గ్రంథాలయముల నభివృద్ధిచేయవలసివచ్చినది. విద్యార్థులకు దేశికునికంటె గ్రంథాలయము లెక్కుడు సాహాయ్యము చేయఁదొడంగెను. భాషకు గ్రంథాలయములే జీవనాధారములు.

## గ్రంథాలయముల ప్రాచీనత.

మనము గ్రంథాలయోద్యమము పాశ్చాత్యులవలన నేర్చికొంటిమని మనవారు భ్రమపడుచున్నారు. కాని ప్రాచీనకాలమునుండియు మనదేశమందు గ్రంథాలయములు కలవు. ఆకాలమున ముద్రణాది సౌకర్యములు లేవు గాన మిగుల నరుదుగనుండెడివి. ఇప్పటికిని మనము ప్రాచ్యలిఖితగ్రంథాన్వేషణకై బయలువెడల నెన్నెన్నియో యముద్రిత తాళపత్రగ్రంథములు లభించుచున్నవి. దానింబట్టి యాగ్రహాయజమానునివంటియులలోఁ బూర్వమెవరో యొకపండితుఁడో యొకభాషాభిమానియో నాపుస్తకముల సేకరించెననియు, ప్రపంచము నాపుస్తకములవ్యాపంపఁజేసెననియుఁ దగితరులవలన వినుచున్నారము. మన గ్రంథాలయ నిర్వహణమిందు గర్భితమైయున్నది. ప్రాయశః మనకిట్టి చరిత్రాంశములకు శాసనాద్యాధారములుకూడ లభించుచునేయున్నవి. ఆకాలమున విద్యాభిమానులైన శ్రీమంతులగు ప్రభువులు గ్రంథాలయముల నెలకొల్పనేర్పుట కష్టకార్యము కాదనుట నిర్వివాదాంశము. నేఁటికిని గొన్నికొన్నిసంస్థానములలో బండ్లకొలంది యపూర్వతాళపత్త్రగ్రంథములు కానవచ్చుట యిందులకుఁ బ్రబలాధారము. పూర్వమువలె నిప్పుడును గ్రంథాలయములు మనదేశమునఁ గలవుగాని నాఁటికి నేఁటికిఁ బెక్కుతెఱంగుల భేదముండవచ్చును. రానురాను దేశమున నవనాగరక దశ దినదినాభ్యుదయముఁ గాంచుచున్నందున గ్రంథాలయముల నిబంధనలధికమై భాండాగారమున కరుదెంచు పాఠకుల కోటుల సంతోషముఁ గూర్పవలయునో, గ్రంథాలయము కర్షకుఁడు

మొదలు పండితోత్తముని వఱకు జనుల నెటుల నాకర్షింపవలయునో, ఆబాలగోపాలమున కెటుల జ్ఞానముఁ బ్రబోధింపవలయునో, చక్కఁగఁ గుఱుతెఱింగి ప్రస్తుత గ్రంథాలయాధికారులు సంచరించుటయుఁ—బ్రకృతము ముద్రణాది సౌకర్యములవలనఁ బొత్తములు సులభసాధ్యములగుటయు— లోనగు నుపయోగములవలనఁ బూర్వము కంటె నేఁడె గ్రంథాలయములవలన నెక్కుడు జ్ఞానము సంపాదించుచున్నారమని నాయభిప్రాయము. మన పూర్వుల యున్నత జీవితాదర్శములగు చరిత్రలు పూర్వమునుండి మనకు లేనందున భరతఖండమున నెందెందు గ్రంథాలయములు కలవో యేయెటుల వృద్ధిక్షయములఁ గాంచెనో వాకొనవకాశము లేకున్నది. గ్రంథభాండాగారములుకూడఁ బూర్వము మనభరతఖండమునఁ గలవని వ్రాయుటకుమాత్ర మొకటి రెండాధారములేని మనకు దొఱుకక పోవు. "నలంద" యను స్థలమున క్రీ.శ. ౭౧ శతాబ్దమున నొక విశ్వవిద్యాలయము గ్రంథభాండారము నుండెననియు, అమరావతికి సమీపముననున్న ధరణికోటయొద్ద ౭౨గురు ఉపాధ్యాయులుగల విశ్వవిద్యాలయము గ్రంథాలయముకలదనియు శాసనాద్యాధారములవలనఁ దెలియుచున్నది. ముఖ్యముగఁ బూర్వగ్రంథాలయములన్నియు దేవళములయందు మఠములయందు స్థాపింపఁబడెను. అప్పుడందలి గ్రంథములు నిమ్నజాతులకు లభింపకపోవుటయుఁ గేవల పండితులకుఁ దక్క సామాన్యుల కాగ్రంథములు లభింపకుండుటయు లోనగు నిర్బంధములు పెక్కులు కలవు. క్రమక్రమముగ మనదేశమున మతద్వేషములు ప్రబలుకొలందిని గ్రంథాలయములు, మఠములు, విశ్వవిద్యాలయములు లోనగు మానవుల పవిత్ర జీవితాదర్శములన్నియు రూపుమాసినవి. నామమాత్రశేషములైనవి. క్రమశః శ్రీకృష్ణదేవరాయలు, తిరుమల దేవరాయలు, అనవేమారెడ్డి లోనగు విద్వన్నృపుల కాలమున భావయు గ్రంథాలయములు పునరుద్ధారణము నొందెఁగాని, తురుష్కులదాడులవలనను అరాజకముల వలనను మనపవిత్ర గ్రంథాలయములు పరశురామప్రీతి నొందినవి. అప్పుడె మనకనులమూసి పాశ్చాత్యులు మన పవిత్ర గ్రంథముల ఖండాంతరములకుఁ జేర్చిరి. ఇంకను మనదేశమున వ్రాతశేషములగు నుత్తమగ్రంథములకొవ్వా చిక్కముగ లేకపోలేదు. కాన దేశీయులందరు గ్రంథాన్వేషణమునకుఁ గడంగుట యుక్తవిధియని విన్నవించుచున్నాను.

## గ్రంథాలయముల కర్తవ్యము.

గ్రంథాలయమన నేదియో, దాని విధాయకకృత్యము లెవ్వియో జనసామాన్యమునకుఁ జక్కఁగ బోధపడనియెడ గ్రంథాలయముల కర్తవ్యముంగూర్చి ముచ్చటించుట ప్రస్తుతము కాదు. ప్రథమమున గ్రంథాలయాధికారు లెట్టివారుగ నుండవలయును? అని విచారింతము. ప్రతిభాండాగారాధికారియు పాఠకులయొక్క యెట్టిసందేహముల నేని నివృత్తిఁజేయఁగల శక్తి సామర్థ్యములు కలవాఁడై యుండవలయును. వీరు తమ గ్రంథాలయమందలి యన్ని గ్రంథములను విమర్శనాదృష్టితో నామూలాగ్రము పరిశీలించియుండుట యుత్తమము. లేక తమ గ్రంథాలయమునందలి గ్రంథముల గుణాగుణములైనను బాగుగా నెఱింగి యుండవలయును. గ్రంథాలయాధికారి ప్రతిపాఠకుని తనకు సమానునిగ బరిగణించుచు శాంతము, అహంకారశూన్యము లోనగు సుగుణములలోఁగూడఁ బాఠకులకు మార్గదర్శకుఁడై యుండవలయును. గ్రంథాలయాధికారి తన జీవితము పరమార్థమునకొఱకు ధారపోయువాఁడుగను ప్రియవక్తృత్వము కలవాఁడుగను, నిర్భరకార్యదీక్షాపరతంత్రుఁడుగను, పవిత్రప్రవర్తనము కలవాఁడుగ నుండవలయును. గ్రంథాలయాధికారి పాఠకులకు గ్రంథము లొసంగుటయుఁ గ్రమ్మఱ పుచ్చుకొనుటయు మాత్రమె తన విధ్యుక్తమని తలంపక, తగుపాటి విద్యాపరిచయము కలవారయ్యు భాషాప్రపంచము కన్నెత్తిచూడక తమకుఁగల తెలివితేటల విద్యకై వెచ్చింపని సామాన్యజనులను భాషాభిమానులుగను జ్ఞానవంతులుగను యుక్తాయుక్తవివేకవంతులగను చేయుటకుఁ బాటుపడవలయును. ఇట్లనుటచే గ్రంథాలయాధికారి విద్యావంతులకు బుద్ధిమంతులకు సహాయముజేయ నవసరములేదా యందురేమో! గ్రంథపఠనాశక్తి కలవారొక గ్రంథాలయమునకేగాక యిచ్చ

వచ్చినచోట గ్రంథముల సంపాదించి పఠించి ఫలమనుభవింపఁగలరు. కాన నట్టివారికి మనము చేయునది సహాయమా? అట్టివారు గ్రంథాలయములకుఁ బ్రతినిత్యముఁగ నుండి సమానబుద్ధితో జనసామాన్యమునకు నూతన వికాసముల గూర్చి విద్యాజ్ఞానముల బోధింపుట యుక్తము. మన దేశమునందలి గ్రంథాలయాధిపతు లిట్టి విధు లాచరణలోనికిందెచ్చిన విజ్ఞానము ప్రజల నాకర్షింపక పోదు. గ్రంథపఠనమునం దాసక్తిఁగల విద్యావంతులకుఁ బుస్తకము లందింపఁగలము. విద్యకలిగి పఠనాశక్తి లేని వారి నెటులో యత్నమొనరించి చదువుకొనునటు లానరింపఁగలము. ఇంతటితో మనము కృతార్థులము కాఁజాలము. పామరులకుఁగూడ విద్యయందలి శ్రేయో లాభము తెలియఁగింపవలయును. గ్రంథాలయములు ముఖ్యముగా విద్యాగంధశూన్యులకొఱకు కన్నిగొప్ప శ్రమలపడి వాండ్రకు విజ్ఞానము ప్రసాదింపవలయును. అప్పటికిఁ గాని గ్రంథాలయ కర్తలమగు సంకల్పము ఫలవంతముకాదు. విద్యాగంధశూన్యులను బైస్కోపు, మ్యాజిక్ ల్యాంటర్న్, సీనోమాటోగ్రాఫ్ లోనగు యంత్రములవలనను, హరికథానాటకపురాణో(ఉ)పన్యాసాది కాలక్షేపముల వలనను, సులభగ్రాహ్యములగు నుపన్యాసములవలనను జ్ఞానాభివృద్ధిఁ గలవారిగ గ్రంథాలయములొనరింప దీక్ష వహింపవలెను. భారతీయులలో వివిధైశ్వర్యములలో విద్యయే మిక్కిలి తక్కువగనున్నది. అందు స్త్రీవిద్య లేనిదానిలోననే చేరినది. స్త్రీలలో నూటికిఁ గోటికొక్కర్తె యెట్టిగ్రంథమునైనఁ జదివి యర్థము సేకొనఁగలదేమో. చదువువచ్చిన స్త్రీలలోఁగూడ నున్నత విద్య చాల తక్కువ. అట్టివారికి మనము శక్తివంచనలేకుండ దోడ్పడవలయును. మన మిప్పుడు గ్రంథాలయములలోనికి హైందవస్త్రీలు వచ్చునటు లేర్పాటు చేయలేక పోయినప్పటికి స్త్రీలయొద్దకైనను వారికర్హములగు సద్గ్రంథముల బంపుచు విద్యాభివృద్ధిచేసి స్త్రీవిద్య నున్నతిలోనికిఁ దేవలయును. ఇప్పుడు మన యాంధ్రదేశమున నున్న గ్రంథభాండాగారములెవ్వియు స్త్రీవిద్యాభివృద్ధికి దృష్టికరముగఁ బనిచేయుటలేదు. మనము స్త్రీ విద్యావశ్యకతఁ దెలిసికొని తదభివృద్ధికై ప్రయత్నింతుము గాక.

జ్ఞానశూన్యులగు పంచ షడ్వత్సరులగు బాలురనే గూడ గ్రంథాలయము లాకర్షింపవలయును. భారతీయులకు గ్రంథాలయములపై ననురాగ మజ్ఞానదశలోననే కలిగినగాని దేశమభివృద్ధిలోనికి రాఁజాలదు. బాలకులే హైందవౌన్నత్య ప్రతిష్ఠానిర్వహణయోగ్యులు కావున వారిని మన మెల్లవిధములఁ గన్పెట్టవలయును. బాలురను పాఠశాలాధికారుల సాహాయ్యముచే భాండాగారములకు రప్పించి వాండ్రకుఁ బ్రీతికరమైనపుడెల్ల భాండాగారములకు వచ్చునంతటి యభిరుచి కలిగింపవలయును. ఇందులకుఁగాను బాలురకుపయుక్తములగు నాటలేర్పఱుపవలయును. వీరుచూచి యానందించుటకు సద్భావబోధకములై చిత్రములైన చిత్తరువులుగల గ్రంథములను గ్రంథాలయములు సమకూర్పవలయును. వీరికిఁ దెలియునంతటి సులభశైలిలో గొన్ని గ్రంథములు వ్రాయించి చదువుకొనఁగలవారి కొసంగి, చదువుకొనలేనివారి కందలి యంశముల బోధించి, జ్ఞానము కలిగింప గ్రంథాలయములు ముఖ్యముగాఁ బనిచేయవలయును. ఇట్టి గ్రంథములు ఆంగ్లభాషలో నరుదుగ నున్నవి. గ్రంథాలయములలో మహాపురుషుల చిత్తరువులు సమకూర్చి వాని వృత్తాంతములు బాలురకు బోధించుచుఁ బరీక్షలలో నుత్తీర్ణులగుబాలురకు బహూకృతు లొసంగుచు బాలుర విద్యాభివృద్ధి ముఖ్యముగఁ జేయవలయును.

గ్రంథాలయములలో బ్రాహ్మణుఁడని వైశ్యుఁడని శూద్రుఁడని నిమ్నజాతీయుఁడని భేదము పెట్టుకొనరాదని నాయభిప్రాయము. జాతిభేదములు గ్రంథాలయములం దీషణ్మాత్రమేని గణింపరాదని సహేతుకముగ శాసింపవచ్చును. సాధ్యమైనంతవఱకు భాండాగారములకు స్వంతభవన మావశ్యకము. ఇవియన్ని యటులుండ సంచారగ్రంథాలయములు నెలకొల్పుట మిగుల నావశ్యకము. సంచార గ్రంథాలయముల వలనఁ బల్లెటూళ్ళ వారలకుపయోగ మెక్కుడు కలదు. ముఖ్యముగా పట్టణవాస్తవ్యులకంటె పల్లెటూళ్ళ

నివసించువారు జ్ఞానశూన్యులుగానుంటచే నీ కార్యము పల్లెటూళ్ళవారి కెక్కుడుపయోగకరము. మనదేశము నిర్బంధవిద్యకు నోచుకొనలేదు కావున గ్రంథాలయములవారు రాత్రిపాఠశాలల నిల్పి, పగలు చదువుకొనఁజాలని వారలకు తమ వ్యయముతో విద్య నేర్పి, ధర్మవిద్యాదానమొనర్చి జనసామాన్యమునకు జ్ఞానము ప్రసాదింపవలయును. మఱియు ముద్రితగ్రంథములఁ గొన్నింటిని సేకరించి యొకచోఁ గూర్చినంతనే దానికి గ్రంథాలయమను పేరొప్పదు. ప్రతి గ్రంథాలయమువారును అముద్రితగ్రంథములను, తాళపత్రగ్రంథములను సంపాదించి గ్రంథాలయముల నలంకరింపవలయును. ముద్రితగ్రంథములను మన నవీను లనేకవిధముల మార్చి మూలకవుల యభిప్రాయముల చెఱచియున్నారు. అట్టి సందేహ నివృత్తికై యచ్చుపడనివేనియును లిఖితగ్రంథముల సంపాదింపవలయును. మన పెద్దలు పఠించు గ్రంథస్థములు కాని చాటుపద్యములను, ఆఁడువాండ్రు, కాపులు, సాదు పాటలను సామాన్యులు చెప్పికొను చారిత్రోద్బోధకములగు కథలను గ్రంథాలయములు ముఖ్యముగా సమకూర్పవలయును. "ఇంటగెల్చి రచ్చగెలువవలె" ననుసామెత జ్ఞాపకముంచుకొని మనచేయిజారి కంటికగపడక ఖండాంతరములకు దేశాంతరములకుఁ బోవనున్న లిఖితపుస్తకములకై తొలుత యత్నించి పిమ్మట ముద్రితగ్రంథములకొఱకు యత్నించుట యుక్తము. మన ముపేక్ష యొనరించుకొలంది, అటుకులపైబడి దుమ్ముకొట్టికొని రానురాను వినాశనమునొందనున్న నష్టశేషములగు మహాకవికృత మహాగ్రంథములు నశించును. కాన నిది శీఘ్రముగఁ జేయఁదగినది. ముద్రితగ్రంథముల సంపాదించుటలో నించుక యాలస్యము కలిగినను మునిగిపోవునది లేదుగాని వ్రాతప్రతులార్జించుటలో నాలసించిన గ్రంథములు నామరూపములు లేకుండఁబోవును. ఇందులకై యొక గ్రంథాలయమువారే గాక ప్రత్యాంధ్రుఁడు యత్నింపవలయును, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు కొలఁది కాలములో నైదువేల తాళపత్త్రగ్రంథములను ఆంధ్రపరిశోధకసభవారు ౧,౨౦౦ లిఖితగ్రంథములను నిన్న మొన్న నార్జించిరి. కర్ణాటకదేశమునను నిజాము రాష్ట్రమునను ద్రావిడదేశమునను నేటికి లిఖితపుస్తకములు కలవు. ఇంకను నూటికి-పదియేని కడకొకటేని యముద్రితగ్రంథము లభింపకపోదు. సకాలములో లిఖితగ్రంథములనార్జించి మనమెల్లరము గ్రంథాలయప్రదర్శనములకు యత్నింపవలసియున్నది. దైవానుగ్రహమువలనను సరస్వతీ ప్రసాదమువలనను మనమీప్రదర్శనముఁ గూడ కొలఁది కాలములో నేర్పఱచుకొన శక్తులమగుదుముగాక.

## ఆంధ్రదేశ కేంద్ర గ్రంథాలయము.

ఆంధ్రదేశమునఁ బ్రస్తుతమున్న గ్రంథాలయములలో భాషాగ్రంథములన్నింటిని సమకూర్చుట దుర్ఘటకార్యము. కాన నింతవఱకుఁ బ్రచురింపఁబడిన ముద్రణగ్రంథములతోడను దేశమున జీర్ణించుచున్న తాళపత్త్రగ్రంథములతోడను ఆంధ్రదేశమధ్యమున కేంద్రగ్రంథాలయ మొకటి ముఖ్యముగా స్థాపింపవలయును. కేంద్రగ్రంథాలయము లేనిది భాషా వృద్ధిలోనికి రాఁజాలదు. దీనికి దొరతనమువారి సహాయము ఆంధ్రమహాజనుల సాహాయ్యము ముఖ్యముగాఁ గావలయును. ఇది నూతనాంశము కాదు.

గ్రంథాలయములభివృద్ధిగనున్న ప్రతిదేశమందు నిట్టి కేంద్రగ్రంథాలయములు కలవు. కేంద్రగ్రంథాలయములయందు దేశమున వాడుకలోనున్న ప్రతిభాషయందలి గ్రంథములు జాగరూకతతో సమకూర్పవలయును. ఇతరగ్రంథాలయములయందున్న యముద్రితగ్రంథప్రతులు సంపాదింపవలయును. కేంద్రగ్రంథాలయము స్థాపించునఱకు నీగ్రంథాలయము లభివృద్ధిలోనికి రాజాలవు. ఇది యాంధ్రులందఱొకమ్ముఖమునఁ జేయఁదగిన కార్యము.

## గ్రంథాలయములవలని లాభములు.

గ్రంథాలయములవలన మనకు ముఖ్యముగా విద్యాలాభము కలుగును. విద్యయనునది మానవులకు పరంపరాగతమగు జ్ఞాననేత్రము. అదిలేని మానవుఁడు చతుష్పాద జంతువులఁ జేరును. దానిఁ బూర్వకవులిట్లు వర్ణించిరి.

శ్లో॥ విద్యానామవరస్యరూపమధికం
ప్రచ్ఛన్నగుప్తం ధనం

# మల్లారెడ్డి

మల్లారెడ్డికవి ప్రసిద్ధాంధ్ర కవులలో నొకఁడు. ఇతఁడు షట్చక్రవర్తిచరిత్రము, శివధర్మోత్తరఖండము, బ్రహ్మోత్తరఖండము, పద్మపురాణము, వాసిష్ఠపురాణము, లైంగ్యపురాణము లోనగు గ్రంథము లాంధ్రమున రచియించెను. మొదటి రెండు పుస్తకములు మాత్రము ముద్రితములై యున్నవి. కవులచరిత్రమున శ్రీవీరేశలింగము పంతులువారు కవి కాలము నిట్లూహించుచు

చ. బలరిపుభోగ కాచ నర
పాలుని పెద్దకుమారమల్ల నీ
కలితయశఃప్రభావములు
కన్గొనలే కల కట్టునన్నె మూఁ
కలు తలఁగొల్లలో బిరుదు
గద్దియముల్ వదిసించుకొందురొ
కొలఁదిరెమెఱుంగఁ జాలక ల
కుక్కలు చుక్కలఁజూచి కూయవే.

ఈపద్యము నే అద్దంకి గంగాధర కవిని గూర్చి వ్రాయుచో

చ. బలరిపుభోగ కృష్ణనర
పాలునిపేర కుమారమల్ల

అని వ్రాసియున్నారు. ఈ పద్యము వలన మల్లారెడ్డికవి యాత్మగౌరవార్థముగాఁ జదివించుకొనెననియు, సాటి రాజులు కత్తిదూసి వీరావేశులైరనియు మల్కిభరాం (యిబ్రహీం) శాంతపరచెననియు నొక దండకవిలెలోని కథను ప్రమాణముగ స్వీకరించి, మల్కిభరాం క్రీ. శ. ౧౫౫౦ మొదలు గోలకొండరాజ్యముపాలించెఁ గాన కుమారమల్లయ నీ పద్యమునఁ జేసికొనఁబడుటచే మల్ల (భూపతి) అప్పటికి కౌమారదశయందుండవచ్చుననియు క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమున జీవించియుండెననియు వ్రాసియున్నారు. ఈస్వల్పాంశమునఁ బెక్కు విఘాతములుకలవు. "కృష్ణనరపాలునిపేర కుమారమల్ల"యని వ్రాసిన పద్యపాఠము మల్లారెడ్డి కన్వయింపదు. కావున "కాచనరపాలుని పెద్దకుమారమల్ల" అను పాఠము స్వీకరింపవలయును. ప్రకృతకవియగు మల్లారెడ్డికవి కాచభూపాలుని పుత్రుఁడేకాని పద్యమునందున్నటులఁ బెద్దకుమారుఁడు కాఁడు. శివధర్మోత్తరఖండమందలి

"తే. గీ. సునుఁడు జంగమరెడ్డియుఁ గామిరెడ్డి
యెల్లరెడ్డి నృపాలుండు మల్లరెడ్డి
నైన నేనును వెలసితిమి......"

అను పద్యమువలనను ఉమాపత్యభ్యుదయములోని వంశవృత్తమువలనను మల్లారెడ్డి కడసారివాఁడని తేలుచున్నది. కావున పంతులువారు వ్రాసిన మొదటిపద్యము దాని పాఠాంతరము ప్రకృతకవి కన్వయింపదు. మల్లారెడ్డి వ్రాసిన గ్రంథములలో నతని యన్నయగు కామిరెడ్డి చక్కఁగ బ్రశంసింపఁబడి యున్నాఁడు. ఇతఁడు పట్టమెట్ట సరస్వతిసోమయాజిచే సూతసంహిత కృతినొంది యున్నాఁడు. మఱియు నితఁడు గోలకొండ నవాబుల మెప్పించి సంస్థానపు సనదు ౧౦౩౧ హిజరీలో (క్రీ.శ. ౧౬౨౨)లో పొందియున్నాఁడు. కావున సుప్రసిద్ధులగు నగ్రజులుండ నందు పెద్దకుమారమల్ల యని మల్లారెడ్డి సంబోధనము చేయనిచ్చునా! మఱియు శివధర్మోత్తరఖండము కృత్యాదియందు

"మ. భువి మా యన్నగు కామిరెడ్డి కృపచేఁ
బోషించి మన్నించినాఁ
డు వెసన్ దాఁ దద్పణంబుపాయునని తో
డ్తో సిద్ధరామార్పణం
బవునంచున్ శివుఁడానతిచ్చినది మే
లౌనంచు బుద్ధిస్థితిన్
శివధర్మోత్తరమట్ల యంకితముగాఁ
జేయంగ నేఁబూనితిన్."

అనియుఁ జెప్పికొనియున్నాఁడు. కావున పైఁ బద్యములు ప్రకృతాంశమునకుం బనికిరావు. కుమారమల్ల

యనుటచే మల్లారెడ్డి యప్పటికిఁ గౌమారదశయందున్నటు లూహించుట పొరపాటు. కుమారపదము పూర్వపదముతో నన్వయింపఁదగినది. ఎట్లయిన నేమి పంతులువారు చేసిన కాలనిర్ణయము సరియైనదికాదు. ఇఁక శాఖానిర్ణయము, జన్మస్థాన నిర్ణయమును గూర్చి పరిశీలింతము. "ఇతఁడు (మల్లారెడ్డి) రాజమహేంద్రవరము పాలించిన వీరభద్రారెడ్డి బంధుఁడనితోఁచుచున్నది" అని పంతులువారు వ్రాసియున్నారు. వీరభద్రారెడ్డికి, మల్లారెడ్డికిని నొక రెడ్డిపదమునఁ దక్క సంబంధములేదని మేము వ్రాయుచున్నారము. వీరభద్రారెడ్డి పంటరెడ్డి కులమువాఁడు. అనితల్లికలువచేఱు శాసనములో

శ్లో॥ తేషాం వేమనరేశ్వరోక్తిభుజాం
ధర్మార్థనావగ్రణీః ............
ప్రసత్పంటకులోద్భవః......అని యున్నది.

ఎఱ్ఱాప్రగడ హరివంశములో

"సీ॥ పంటకులస్వామి ప్రఖ్యాతుఁడగు వేమ
నయు పితామహుఁడనుమాన్యతయును"

అని యున్నది. వీరభద్రారెడ్డి వేమారెడ్డి బంధువులలోని వాఁడేకదా! దీనింబట్టి యద్దంకి రాజధానిగఁ బాలించిన వేమభూపాలుని వంశము వీరభద్రారెడ్డి వంశము పంటరెడ్డివంశమని తెలియుచున్నది. మల్లారెడ్డి వంశము పాకనాటిరెడ్డి వంశమని శివధర్మోత్తరఖండమున

"ఆ॥ వె॥ అట్టిపాకనాటి యన్వయంబనెడి క్షీరాబ్ధి"

అనియు,

భద్రాయురభ్యుదయమున (ఈగ్రంథరత్న మీ వంశీయులకే యంకితము గావింపఁబడినది)

"క॥ ఆపాకనాటివంశో
ద్దీపకుఁడై కామినేఁడు" అనియు,

ఉమాపత్యభ్యుదయమున

"సీ॥ సమదవేదండ దేహము దున్నిపో నీకు
నాటువా రిల పాకనాటివారు......
"క॥ ఆపావన వంశంబున
దీపింపఁగఁ బొడమె కామినేఁడు......"

అనియు నీ వంశము చెప్పఁబడుటచే నేతద్వంశీయులు పాకనాటి రెడ్డివారని తేలినది. ఉభయులకు బాంధవ్యాదికములు వీరేశలింగము పంతులువా రున్నటు లూహించిరికాని యది సరికాదని స్పష్టపడుచున్నది. ఇఁకఁ బంతులువారు మల్లారెడ్డి జన్మస్థానవిషయమున "ఈ మల్లారెడ్డి......గోదావరి మండలములోని బిక్కనవోలు సంస్థానప్రభువు" అని నిర్ధారణ చేసియున్నారు. దీనికాధారము షట్చక్రవర్తిచరిత్రములోని గద్య "ఇది శ్రీ బిక్కనవోలు పట్టణ ప్రసిద్ధ సరస్వతీకావలంబ సిద్ధరామేశ్వర" అని బిక్కనవోలు పేర్కొనబడి యుండుటచేతను, ఆగ్రామము గోదావరి మండలమునఁ గానవచ్చుటచేతను, ఆప్రాంతముల రెడ్డివారు పాలించియుండుటచేతను మల్లారెడ్డి గోదావరిమండలవాసియని శ్రీ పంతులవా రూహించిరి. ఇది ప్రమాదము. పట్టమట్ట సరస్వతి గోపయాజిగారి నూతిసంహితను పరిశోధించిన నీ సంశయము తీరునది. మల్లారెడ్డి నివాసస్థానమగు బిక్కనోలు నిజామురాష్ట్రములో హైదరాబాదునుండి ఇందూరునకుఁబోవు రైలుమార్గమున నున్నది. తద్వంశీయులు సమీపస్థమగు దోమకొండలో సంస్థానము స్థాపించి నిజామువారికి సామంతులై నేఁటికి రాజ్యము పాలించుచున్నారు. ఇందులకు శివధర్మోత్తరఖండమునఁ బెక్కాధారములు కలవు.

"మ. ఘనుఁడా కాచనృపాలశేఖరుఁడు మున్
గర్ణాట దేశంబునం
దున దుర్గాధిపతిత్వవైభవము తో
డ్తోఁ గాంచి సుల్తాను పి
ల్వనఁ గృష్ణానది దాఁటి యామెదుకుబల్
దుర్గంబుక్రిందన్ జిరం
తనమా బిక్కనవోలనుండె నది యా
త్రస్థాన రాజమ్ముగన్."

శివధర్మోత్తరఖండములోని పైపద్యమువలన మల్లారెడ్డి కవి నివాసమగు బిక్కనవోలు నైజామురాష్ట్రములోని మెదుకుసీమకుఁ జేరిన బిక్కనవోలని స్పష్టమగుచున్నది. బిక్కనవోలులో రాజ్యముస్థాపించిన కాచనరెడ్డికి మల్లారెడ్డి యైదవపురుషుఁడు. దీనఁజేసి మల్లారెడ్డి నిజాం మండలవాసియని వెల్లడి యగుచున్నది. నేఁటివఱకు నీవంశీయులు తమ పవిత్రములగు నామములతో గట్టించిన గ్రామములు వీరి సంస్థానమునకు లోబడి దోమకొండకు పదిమైళ్ళకు లోపుగానున్నటుల సమాపత్యభ్యుదయమందలి

సీ. షామమ్మలేదు జంగముపల్లెకేనాఁడు
నీనాఁటికోసఁగు బదేనువేలు
మహిమనొప్పెసఁగుఁ గామారెడ్డిపేటన
పదమూఁడువేల కొప్పమ్ములొసఁగ
సారవంతమగు నెల్లారెడ్డిపేట ప
దేను వేలకుఁ గొలయిమ్మదెప్రభ
లక్ష్యంబులేదు మల్లారెడ్డిపేటకు
నిండుగానొసఁగుఁ బంద్రెండువేలు
గీ. ఈ పురములెల్ల పదిమైళ్ళ కెచ్చులేక
దోమకొండకు నల్లంత దూరమునను
స్వీయనామాంకితమ్ముగా జెలువులెనసి
కరమొసంగు సుభిక్షంబుఁ గలిగియుపుడు.

పై పద్యములోని పల్లియలు నాలుగు ప్రకృతకవియగు మల్లారెడ్డి యన్నలగు ముప్వురిపేరుతోను దనపేరుతోను గట్టింపఁబడినవి. కావున మల్లారెడ్డి నివాసము దోమకొండ యనియుఁ నతని పూర్వుఁడగు కాచరెడ్డిమాత్రము బిక్కనోలులో రాజ్యము స్థాపించెననియు ఆబిక్కనోలు ఐకూడ గోదావరి మండలములోనిది కాదనియు వీరభద్రారెడ్డికి మల్లారెడ్డికెట్టి బాంధవ్యములేదనియు పైయాధారములవలన స్పష్టమగుచున్నది. కవివంశీయులు నేఁటి హైదరాబాదులోను దోమకొండయందున్నారు. వీరు గద్వాల ప్రభువులకు బంధువులు. ఈసంస్థానము సంవత్సరమునకు మూఁడులక్షల యాదాయము కలదిగ నున్నది. మల్లారెడ్డి యన్న కామిరెడ్డి సూతసంహిత కృతి చెందియున్నాఁడు. కామిరెడ్డి మల్లారెడ్డి యన్నయని యిదివఱకె వాకొనియున్నారము. ఈకామిరెడ్డి పైకృతినొందినటుల శివధర్మోత్తరమునఁ జెప్పఁబడియే యున్నది.

"సీ. మున్ను నీయన్న లభ్యున్నతి గాఁ గామి
రెడ్డివర్యుఁడు నెల్లరెడ్డిమౌళి
సూతసంహితయు నాబ్రహ్మోత్తరగ
ఖండంబులంది రఖండపటిమ ..."

అను పద్యమందలి క్రమాన్వయముచేఁ గామిరెడ్డి మల్లారెడ్డి కగ్రజుఁడనియు సూతసంహిత కృతినందెననియు స్పష్టపడుచున్నది. కావున సరస్వతీసోమయాజికవి మల్లారెడ్డికి సమకాలికుఁడు. మల్లారెడ్డి యన్న కాచారెడ్డి నిజాము ప్రభువువలన సనదుల హిజరీ ౧౦౫౫ సరియగు క్రీస్తుశకము ౧౬౪౫ సంవత్సరము ప్రాంతమున పొందినటుల స్పష్టపడినది. శ్రీ పంతులువారు మల్లారెడ్డి విషయమై వ్రాసిన యుపన్యాసమున నిన్ని దోషములు కలవు. సుధీలోకము సంశయములున్న చర్చించి, పరిషత్తులో సంచారకార్యదర్శులమై మేము స్వయముగఁ దిరిగితిరిగి కనుఁగొన్న యిందలి యంశములను చరిత్రాధారములను విశ్వసించి యాథార్థము గ్రహింపఁ బ్రార్థితులు. ప్రకృత మల్లారెడ్డి వంశీయులగు శ్రీరాజా రామచంద్రరావుబహద్దరువారు శివధర్మోత్తరము నిర్దుష్టముగా ముద్రింపించి భాషాపరిచయుల కుచితముగ నొసంగుచున్నారు. సుప్రసిద్ధులగు కవులనేకులు రచించిన ప్రబంధములనేకములు వీరి సంస్థానమున నముద్రితదశలో నున్నవి. శ్రీ రాజావారాగ్రంథములకుఁ గూడ ముద్రణభాగ్యము లభింపఁజేసి స్వవంశయశము లోకమున విస్తరింపఁజేయఁ బ్రార్థితులు.

— శేషాద్రి రమణ కవులు,
శతావధానులు.

# శాద్వలము

చ. నవనవలాడు లేఁగసవు ◆ సారులలోఁ బల మంచుచిన్కు ల
న్నవచెలువంబులీనఁగ వి ◆ నోదముగాఁ దృణజీవికోటుల్
రవము లొనర్పఁగాఁ గలువ ◆ రాయఁడు వెన్నెలఁ గాయుచుండ నీ
నవకము నేత్రపర్వము న ◆ నర్పదొడంగును శాద్వలస్థలీ.

చం. పిచ్చికగడ్డిపూవులొక ◆ పింపుఘటింపఁగ మొల్క లెత్తు లే
బచ్చిక లీడురాని చెలు ◆ వంబును సారెకుఁ గుమ్మరింపఁ గా
ర్చిచ్చొనరించినట్టి విపరీ ◆ తమునుండి విముక్తమైన నీ
యచ్చపుఁ జెల్వమెన్న వశ ◆ మా విధికేనియు శాద్వలస్థలీ.

ఉ. జంపుగసాగు లేఁగసవు ◆ జాడలలో ముగముంచి చూపులన్
సొంపులుమీఱ నల్లఁ జను ◆ చున్ మెడలెత్తుచు లేడిపాళెముల్
గుంపులుగూడి నల్దెసలఁ ◆ గ్రుమ్మరువేళల నీదుచెల్వ మూ
హింప వచింప శక్యమగు ◆ నే! కవికేనియు శాద్వలస్థలీ.

చ. పరువపు గడ్డిపూవు లొక ◆ ప్రక్క విచిత్రయచిత్రభాగముల్
గలుప, ప్రఫుల్ల పుష్ప తృణ ◆ కాండము తావుల ప్రోవులీన తే
గటికి పొలమ్ము లబ్బురముఁ ◆ గల్పనఁ జేయ శరత్తునందు సుం
దరముగ జవ్వనంబునఁ ద ◆ నర్తువు నీవిల శాద్వలస్థలీ.

చ. ఆనినఁగందు లే జివురు ◆ టాకులలోఁ దుహినాంబు బిందువుల్
సోనలు దేఱి సామ్యదిల ◆ సూర్యకరప్రకరమ్ముచేతఁ జ
త్రైన విచిత్ర వర్ణముల ◆ యోగజమున్ వెలిబుచ్చువేళ యు
వ్వానికి నీవు సమ్మదము ◆ నైకొనఁ జేయవు శాద్వలస్థలీ.

చ. ఇరుదెసలంటి పాఱు సల ◆ యేళులలో జనియించు తెల్లపూ
సరములు సాటిగాని రుచి ◆ సంపదఁ గుర్పఁ దటద్వ్యథాంబునన్
బెరిగెడి తుంగమోసు లొక ◆ వింపు ఘటింపుచు నుండ ధారుణీ
తరుణికిఁ జిత్రవస్త్రము వి ◆ ధంబున నుండువు శాద్వలస్థలీ.

ఉ. తావులుగల్గు పూవులును ◆ దాఁకినఁ గందు చివుళ్ళు, కందొగన్
గావిని గేరు లే గఱికె ◆ కాడలు గల్గి పొసంగు చక్కనౌ
తీవెలు, నల్ గొలంకులను ◆ దీటిచి నట్టులఁ గానవచ్చుటన్
ద్రోవరులెల్ల నిన్నుఁ గని ◆ తోషముఁ గాంతురు శాద్వలస్థలీ.

చ: అలతిగనున్న తేఁటి కసు • కందునఁ బొల్చిన యచ్చమౌ తెలం
కులఁ, గవఁగూడి యిచ్చ మెయిఁ • గ్రుమ్మరు నంచల ప్రోఁతలుం మదా
ళుల రమణీయ నిస్వనము • లుం బ్రకృతిప్రస బోధఁ జేయు నీ
సాలఘు రసప్రలుబ్ధ జన • ముం దనియించును కావ్యలక్ష్మి.

చ. కువలయవైరి వేఁడివెలుఁ • గుల్ దెసలం బరగించువేళఁ దాం
దావ చెలికాఁడు వెన్నెలలఁ • దోరముగాఁ వెలయించునప్పు డె
క్కువగను సంచువాన చినుకుల్ పడ నత్తఱి నీదు చల్వ ము
త్సవకరమై ప్రమోదమును • సంఘిలఁ జేయును కావ్యలక్ష్మీ.

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

# అల్లాడు నరసింహకవి

ఆంధ్రభాషయందుఁ బురాణములు నుపపురాణములు కూడఁ జాలభాగము భాషాంతరీకరింపఁబడినవి. శైవులును వైష్ణవులును వారివారి మతములకు సంబంధించిన పురాణములు చాలవఱకు భాషాంతరీకరించియుండిరి. శైవ వైష్ణవమత ప్రతిపాదకములగు పురాణములు నుపపురాణములు నెన్నియో ఆంధ్రపరిశోధక మహామండలివారికిఁ జిక్కినవి. అందుఁ బ్రస్తుతము నారదీయమును గురించి ప్రస్తావించెదను. శ్రోత్రలంక మృత్యుంజయుఁడు వ్రాసిన బృహన్నారదీయము మంచి ప్రతులు ౨, 3 వేఱుగ మాకడనున్నవి.

ఇప్పుడు చెప్పఁబోవునది నారదీయము. ఇందు ౭ ఆశ్వాసములు సంపూర్ణముగనున్నవి. ఎనిమిదవ ఆశ్వాసము కొంతలతోనున్నది. దీనిని రచియించినది అల్లాడు నారసింహకవి. ఇది వైష్ణవమత ప్రతిపాదకమైన గ్రంథము. కృష్ణునకుఁ గృతి యీయఁబడినది. శ్రీకృష్ణుఁడే కృతిభర్త కావున కృతిభర్త వంశావతార వర్ణనముగ విష్ణుపురాణ భాగవతముల సారాంశమంతయుఁ బ్రథమాశ్వాసమునఁ గవివర్ణించి భక్తిని బ్రదర్శించియున్నాడు.

కవినిగురించి యీక్రింది యాధారములవలనఁ దెలియఁదగిన విశేషములఁ జరిత్రకారులు తిసికొందురుగాక!

(౧) ఆదిని విస్తుతియందు కవిత్రయమును మాత్రము పేర్కొనెను,

"నన్నయభట్టు దిక్కకవి
సాధుని కెట్టినమంత్రి గొల్చెదన్" అని

(౨) కశ్యపుని వంశమునఁ దనపూర్వుల వంశము కలిగినట్లు చెప్పుకొనినాఁడు.

క. కరుణాకర మంత్రీంద్రుఁడు
కరుణావరుణాలయుండు గంభీరుం డా
తరుణార్క దివ్యతేజుం
డురుణానుజ రాజిరాజితాత్ముఁడుగలిగెన్.

అతనికి 'అల్లాడు చన్నప్ప' అను వైష్ణవ భక్తాగ్రేసరుఁడు పుట్టెను. కవి యీ చన్నప్ప కొడుకు.

సీ. ఎద్దేశికాధ్యక్షు ♦ డేకశిలాపురి
నిజమతంబంతయు ♦ నిర్వహించె
ఏదేశికశ్రేష్ఠుఁ ♦ డాదిరైయె రామాను
జాచార్య విజయధ్వ ♦ జాంకమయ్యె
ఏదేశికాధ్యక్షు ♦ డిద్ధబుద్ధి స్ఫూర్తి
బ్రహ్మరాక్షసుల శా ♦ పంబణంచ
ఏదేశికోత్తము ♦ లెదిరించి నిలిచిన
శక్తికిచక్రాంక ♦ శక్తిమొసఁగె
గీ. నతఁడు వైష్ణవ సింహాసనస్థుఁ
డుభయ వేదాంత విద్యామహోన్నతుండు
శుద్ధసాత్త్వికధర్మప్రసిద్ధకీర్తి
శాలికంజర్ల కేశవాచార్యమౌళి.

అట్టి భరద్వాజ గోత్రుఁడగు కేశవాచారి వంశమునఁ గొండమాచార్యుఁడు పుట్టెను. ఈకొండ మాచార్యుఁడు కవి గురువు. గురువు స్వప్నమునఁ గనుపించి యీకథ వ్రాయుమని యానతీయఁ దానీపనికిఁ బూనుకొనినట్లు కవి వ్రాయుచున్నాఁడు. గణపతి దేవుని నాఁటికి ఓరుగల్లు శైవమతము నవలంభించెను. అందుచేఁ బూర్వమే వైష్ణవమచ్చటఁ బ్రాకియుండవలెను. కవికాలము కాని, కవి గురువు కాలముకాని తెలియుటకేమియు సాధనములు స్పష్టముగఁ గన్పట్టుటలేదు. ఆశ్వాసాంత గద్య యిట్లున్నది.

"ఇది శ్రీమత్కంజర్ల కొండమాచార్య పాదారవింద మిళిందాయమాన చన్నయామాత్య పుత్ర కస్యప గోత్రపవిత్ర శ్రీమదాల్లాడు నరసింహ ప్రణీతంబైన నారదీయ పురాణంబునందు.—ఆశ్వాసము"

రమాగమి ౨౬౦ పుటల కిరుప్రక్కల వ్రాయఁబడి యున్నది. ఏడాశ్వాసముల వఱకుఁ బ్రతి పరిశుభ్రముగ నున్నది. తప్పులక్కడక్కడఁ గన్పట్టుచున్నను వ్రాఁత మంచిది. పుటకు ౫ పంక్తులున్నవి. ౨౧ అంగుళముల పొడవుగల తాటియాకులమీద వ్రాయఁబడినది ౧॥ అంగుళములు పుటి వెడల్పు.

దీనికిఁ బ్రత్యంతరము రాజమహేంద్రవరమున శ్రీ వీరేశలింగ భాండాగారమున నతిశైథిల్యము నొందియున్నది.

శైలి తెలియుటకొక పద్యము:—
క. అధిప సరోజసంభవుని
యాత్మజ నేను సరోజసూను ని
న్నధిపతిగాఁ దలంచి మన
మారఁగ నన్ను సృజించినాఁడు నే
డధికులు రుద్రముఖ్యదివి
జాగ్రణులున్న పరిత్యజించె నేఁ
డభ్యుదితవాంఛితార్థుని
కృతార్థుని నిన్ను భజింపవచ్చితిన్.

పిల్లలమర్రి పినవీరభద్రుఁడుకూడ నారదీయ పురాణము నాంధ్రభాషలో రచియించినట్లు చెప్పుకొనియున్నాఁడు. కాని యదియింతవఱకుఁ గాన్పింపలేదు. ఈతఁడైన సంచికవియే. ధారాళమైన భాషలో వ్రాయఁగలవాఁడు. శైలి మంచిది. ప్రబంధ కావ్యమునకుఁ దీసిపోవనిది.

—నాగూరి సుబ్బారావు.

# గ్రంథాలయము.

సీ. భాషాలతాపసు స్మేమక్రమంబున ♦ కాలవాలంబు గ్రంథాలయంబు
కవిజనవ్రాత కాంక్షాపరిస్ఫూర్తికిఁ ♦ గాళివరంబు గ్రంథాలయంబు
సాంఘికవిద్యార్థి చాతకశ్రేణికి ♦ నీలమేఘంబు గ్రంథాలయంబు
జాతీయధర్మప్రభాతకాలమునకు ♦ బాలాతపంబు గ్రంథాలయంబు
గీ. సకల వేదాంత సిద్ధాంతసారబోధ । కనుపమాచార్యకంబు గ్రంథాలయంబు
ధాత్రిదేశాభివృద్ధి సంధానమునకు । లాలనీయాగమంబు గ్రంథాలయంబు.

—పిశుపాటి చిదంబరశాస్త్రి, శతావధాని.

# లిఖిత పుస్తక కేంద్రాలయము*

౧ రమ్యాంధ్రరాష్ట్రహర్మ్యంబునందు రాజిల్లు తేజోనిధానమౌ దీపకాంతి
భాషాబ్ధిపైఁ దేలి వ్యాపించు సద్గ్రంథ నౌకావితతి రక్షణ స్థలంబు
వరపండిత కవీశ భాషాభిమానులన్ కీరాదులకు సహకారవనము
భువి శాశ్వతంబగు పూర్వవిజ్ఞాన సద్విత్తంబు దాఁచెడు పెట్టెయనఁగ
నలరు పూర్వ సద్గ్రంథకేంద్రాలయంబు - నాంధ్రభూజుండు శ్రీకృతికావనీశుఁ
డాదరింపగ నిరుపమఖ్యాతితోడ - జగతి వర్ధిల్లగలదు నిస్సంశయముగ.

౨ పురువు నోళులఁ బడి పొలిసిపోయిన వెన్ని యగ్నికీలల దగ్ధమైన వెన్ని
వరద పాలైపోయి వార్ధిఁ జేరిన వెన్ని శిథిలంబులై రూపుమాసెడిన వెన్ని
చిన్నపిల్లలు వేడ్కఁ జింపివేసిన వెన్ని సూత్రంపు కోతల నరిగె నెన్ని
పరుల చేతులఁ బడి పాడైనవియెన్ని యితరవిధంబుల నెగిరె నెన్ని
పోయినవి పోవ మిగిలిన పుస్తకముల - నైన జేర్చి కాపాడ మేలంచుఁ దలంచి
ఘన యశఃకాముఁడౌ చెలికానివాఁడు - పూనుకొన్నా డాంధ్రుల పుణ్యమునను.

3 గ్రంథముల్ గలవారు ప్రచురింపనొల్లరు ప్రచురించువారికి నదలఁబోరు
ప్రతివ్రాసి దానిఁ గాపాడఁగాఁ జూచెరు ప్రతివ్రాయ నెరవీయఁ జాలుపడరు
తాము చదివియైనఁ దన్మహాత్మ్యము చెప్ప రొరులకుఁ జూపింప నొల్లకుంద్రు
సొమ్ము నైకొనియైనఁ జూపింపఁ దలఁపరో యున్నను లేదనుచుందు రకట
గోవు నదలించు పచ్చికఁ గుక్క తినదు - వెఱ్ఱిపద్ధతి యిట్లనైన విడిచిపెట్టి
పుస్తకంబులఁ జేర్చుచు బ్రోవరయ్య - శాశ్వతంబగు పూర్వవిజ్ఞాన మహిమ.

౪ సర్వజనాహ్లాద సంధాయి సుగుణగణములు సువర్ణపర్ణములు గాఁగ
ఔదార్య పరిమళం బనయంబు ప్రకటించు సరసోక్తతీతి పుష్పచయము గాఁగ
శ్రితజనాధారమై చెలఁగెడి కరుణారసంబె స్వాదు మకరందంబు గాఁగ
కరుణతోఁ బరులకుఁ గాసించు సత్కార్యకాండముల్ సత్ఫలగణము గాఁగ
విబుధసన్నుత శ్రీకల్పవృక్షము వలెఁ - జెలఁగు సూర్యరాయ ప్రభు జ్యేష్ఠసుతుని
యతులాభ్యాస శుభసమయమున నిలిచె - వృద్ధిఁ బొందును యువరాజ విద్యతోడ.

౫ వివరింప సూక్ష్మమౌ విత్తనంబునఁ బుట్టి పెనువృక్ష మగఁ బెరుఁగునట్లు
ఆదిలో నొకయంగతో నాటఁదగు నేలు తుద కానుడ వెడల్పు తోడగునట్లు
తొలుత లాడిలెడు నెమలిపించము తుది బాగైన వన్నెల వఱలునట్లు
మొట్టమొదట చిన్నమొట్టయై చివరకు పెద్దపర్వతముగాఁ బెరుఁగునట్లు
మీరు చేయు సత్కార్యంబు మేదినిపయి - దినదినాభివృద్ధినిఁ జెంది తేజరిల్లు
ధర్మగుణకాయ చెలికాని ధర్మరాయ - ఆర్యవినుత లచ్చారాయ సూర్యరాయ.

* పీఠికాపురమునందు ఆంధ్రపరిశోధక మహామండలి వారిచే స్థాపితమైన లిఖితపుస్తక కేంద్రాంధ్ర గ్రంథాలయ ప్రారంభోత్సవ సమయమున శ్రీ అదంట సూర్యనారాయణరాజుగారిచే చదువబడినవి.

# బరోడా యాత్ర *

ఈ వత్సరమున నాల్గవ గ్రంథాలయప్రతినిధుల మహాసభ గంజాం జిల్లా "బారువ" గ్రామమునందు జరుగునని ఎల్లరకును తెలిసిన విషయమే.

"బారువ" యందు ఈ వత్సరము జరుగు గ్రంథాలయ ప్రతినిధుల సభతోబాటు గ్రంథాలయప్రదర్శనమును గూడ ఏర్పాటు చేయవలెనని ఆలోచించితిమి. గ్రంథాలయ సర్వస్వము మొదటి సంపుటము యొక్క రెండవ సంచికయందు "సమాళన" గ్రంథాలయ ప్రదర్శనమును గూర్చి తెలిసికొనిన చదువరులకు గ్రంథాలయ ప్రదర్శనమన నేమియో తెలియదని తలంపను.

ఈ ప్రదర్శనము యొక్క ఆవశ్యకతను గూర్చి పలువురతో ఆలోచింపగా, అందరును ఉత్సాహముతో గూడిన ప్రోత్సాహమునే జూపిరి. అందుచేత కార్యక్రమమునకు గడంగుటకై ఆలోచించి, ఈ ప్రదర్శనమును నిర్వహించుటకై కొన్ని ప్రదర్శనార్హములగు వస్తువుల నంపి సహాయము చేయవలసినదని కోరుచు, మన సంఘమునకు ఉపాధ్యక్షులగు శ్రీ సూరి వేంకటనరసింహ శాస్త్రిగారు, బరోడా గ్రంథాలయ శాఖాధ్యక్షులగు శ్రీ జే. యస్. కుడల్కార్ గారికి ఉత్తరమును వ్రాసిరి. అందుమీద వారు ౧౯౧౭ సం. జనవరి ౨వ తారీఖు మొదలు ౯వ తేదీవఱకు బరోడాపట్టణమందు వ్యవసాయక పారిశ్రామిక ప్రదర్శనమొకటి జరుగనున్నదనియు, అందు గ్రంథాలయప్రదర్శన శాఖగూడ ఏర్పరుపబడుననియు, ఆప్రదర్శనమునకు ఎవరినైన ప్రతినిధి నంపినయెడల, వీలయిన ప్రదర్శనములను దీసికొని పోవచ్చుననియు ప్రత్యుత్తరమిచ్చిరి. ఈ లేఖ వచ్చునప్పటికి నేను గ్రామమునందు లేను. కొంచెము పనిగలిగి అమలాపురము తాలూకాకు బోయి యుంటిని. పని తీరిన పిమ్మట అమలాపురం, రామచంద్రపురం తాలూకాలయందున్న కొన్ని గ్రంథాలయములను దర్శింపుచు కొంత కాలహరణమును జేసితిని.

బరోడాయందు జరుగు ఈ గ్రంథాలయ ప్రదర్శనమునకు బోవుటకై శ్రీ సూరి వేంకటనరసింహముగారు తలంచిరి. కాని వారి న్యాయవాదివృత్తియందుండు నట్టి జవాబుదారీనిబట్టియు, పనితొందరనుబట్టియు అట్లు చేయజాలకపోయిరి. శ్రీ గోపరాజు బ్రహ్మానందముగారును పోవలయునని తలంచిరి; కాని గృహకృత్యసంబంధములైన ఇబ్బందులచే పోజాలక పోయిరి. అందుచేత బరోడానుండి వచ్చిన ఉత్తరమును నాకు తెలుపుటకై అమలాపురమునకు బంపిరి. కాని నేను అక్కడక్కడ తిరుగుచుండుటచే ఆ ఉత్తరము నాకందలేదు. ఇంతలో డిశంబరు నెల ౨౦ వ తారీఖు వచ్చినది. నేను నా ప్రయాణమును ముగించుకొని ఇంటికి వచ్చితిని. వచ్చునప్పటికి విశేషముగ పడిశ్రమముగ నున్నది. కొంచెము దగ్గుకూడ వచ్చుచున్నది. కాలిమీద ఒక పెద్ద కురుపు లేచి యున్నది. పాదము యొక్క ఒక వ్రేలికి ఎదురు దెబ్బ తగిలి విశేషము బాధపెట్టుచున్నది. ఇట్టి స్థితియందు బరోడాప్రయాణమును గూర్చి చెప్పిరి. ఇంతేగాక అచటికి వెళ్ళుటకు ఖర్చులకుగాను నలువది రూప్యములనుగూడ శ్రీ సూరి వేంకటనరసింహము గారు తెచ్చియిచ్చిరి. అట్టి స్థితియందు వెళ్ళకుండ నుండుటకు నాకు తోచకపోయినది. అందుచేత దైవముమీద భారము వైచి జనవరి ౭వ తేది రాత్రి బయలుదేరి ౮వ తేది ఉదయమునకు బొంబాయి చేరితిని. బొంబాయినుండి ఆరాత్రియే బయలుదేరి ౯వ తారీఖు ఉదయమునకు బరోడా రయిలుస్టేషనునకు చేరితిని. నన్ను తీసికొనిపోవుటకై "లైబ్రరీ మిసలేనీ" పత్రికయొక్క సహాయ సంపాదకులును, బరోడా కేంద్రగ్రంథాలయమునందు గ్రంథభాండాగారులలో నొకరును అగు ౧. యామ్.

* ఈ సభ జరుగుటకు పూర్వమే ఈ వ్యాసము వ్రాయబడినది.

దాదా చాంజీ గారిని రయిలుస్టేషనునకు పంపిరి. వారితో గూడ బయలుదేరి నాకొఱకు ఏర్పరుపబడిన బసయందు సామానులను బెట్టి, ప్రదర్శనస్థలమునకు బోతిని. పది ఎకరముల విశాలము గలిగిన గొప్ప మైదానమునందు ఈ ప్రదర్శన మేర్పరుపబడినది. ఈ స్థలమునకు చుట్టును ప్రదర్శనశాలలను గట్టి, మధ్యభాగమునంతను పలువిధములగు జలయంత్రములతోడను, నానావిధములగు దీపస్థంభములతోడను, వింతలను గొల్పుచుండు రాతి బొమ్మలతోడను అలంకరించిరి దీపములవేళ యగుసరికి ప్రదర్శనాస్థలమంతయు రెండువేల విద్యుచ్ఛక్తి దీపములతో దేదీప్యమానముగ వెలుంగుచు ఎంతయు దర్శనీయమై యొప్పుచుండెను. ప్రదర్శనమంతయు ౧ వ్యవసాయము ౨ అడవి పదార్థములు ౩ పరిశ్రమలు ౪ విద్య ౫ పుస్తకాలయము అని ఐదు భాగములుగ విభాగము జేయబడినది.

వ్యవసాయభాగమునందు— బరోడారాజ్యమున పండు వివిధములగు ధాన్యములు, అవి పండించుటకు గల నూతన విధానములు, వాని కుపయోగించునట్టి నూతనపరికరములు మిక్కిలి విపులముగ ప్రదర్శించిరి పైరులను పాడుచేయునట్టి అనేకరకముల పురుగులను, వానియొక్క వివిధావస్థలయందు ప్రదర్శించిరి. ఇంతేగాక పలువిధములగు పూలచెట్లను, పుష్పములను, పండ్లచెట్లను పండ్లను గూడ ప్రదర్శించిరి. మహారాజాగారి స్వంతతోటనుండి పండ్లచెట్లయొక్కయు పుష్పముల చెట్లయొక్కయు గింజలను ఉచితముగా పంచిపెట్టుచుండుటచే ఈ చెట్లను పట్టణమునందంతటను విశేషముగా బెంచుచున్నారు. బరోడారాజ్యమునందు నూటికి ఎనుబదిమంది వ్యవసాయమువలన జీవించుజనులై యున్నారు. అందుచేత మహారాజాగారు వ్యవసాయాభివృద్ధి విషయమై విశేషముగ శ్రద్ధను వహించుచున్నారు. ౩౫ సంవత్సరముల క్రిందట మహారాజాగారు సింహాసనము నెక్కినప్పుడు గొప్ప వ్యవసాయప్రదర్శన మొకటి చేయబడినది. అప్పటి నుండియు వ్యవసాయకుల స్థితిగతులను బాగుచేయుటకై మహారాజాగారు పలువిధముల పాటుపడుచునే యున్నారు. రాజ్యమునంతను క్రొత్తగా సర్వే చేయించి, భూమియొక్క ఫలసాయమునుబట్టి పన్నుల నేర్పరచిరి. వ్యవసాయశాస్త్రము నభ్యసించుటకై అమెరికా, ఐరోపా దేశములకు విద్యార్థుల నంపుటయే గాక, ఈ సంస్థానమునందొక వ్యవసాయపాఠశాలను గూడ స్థాపించిరి. విద్యార్థులు స్వయముగా చూచి నేర్చుకొనుటకును, మంచి విత్తనములు పండించి, రైతులకు పంచిపెట్టుటకును పరిశోధక పొలముల నేర్పాటు జేసిరి. ఇంకను పలువిధముల వ్యవసాయమభివృద్ధి నొందుటకై ఈ ప్రదర్శన మేర్పాటు జేయబడినది.

అడవిపదార్థశాఖయందు, బరోడారాజ్యమునందున్న అడవులయందు దొరకునట్టి, పలువిధములగు వృక్షజాతులు, ఖనిజములు ప్రదర్శింపబడినవి. ఇంతేగాక ఆ యడవులయందు సంచరించునట్టి పలువిధములగు అడవిమృగముల చర్మములు, శ్రీ బరోడా మహారాజుగారిచే స్వయముగా చంపబడిన అడవి మృగముల స్వరూపములు గూడ జూపబడినవి.

పరిశ్రమల నభివృద్ధిచేయుటకై బరోడాయందు ప్రత్యేక మొక శాఖను శ్రీ గాయక్వారుగారు చాలకాలము క్రిందటనే ఏర్పరచిరి. ౧౯౦౬ వ సంవత్సరమున శ్రీవారు అమెరికా దేశమునుండి తిరిగి వచ్చినప్పుడు ఈ శాఖాధ్యక్షతను వహించుటకై ఆదేశమునుండి ఒక శాస్త్రజ్ఞుని తీసికొని వచ్చిరి.

ఎగుమతి దిగుమతి పన్నులను తీసివేయుటయే గాక తగిన ప్రోత్సాహమునుగూడ ఇచ్చుచుండిరి. అందుచేత ఈరాజ్యమునందు పరిశ్రమలు విశేషముగ నభివృద్ధినొందినవని చెప్పుట కంతిమాత్రమును సందియములేదు. ఈ రాజ్యమునందే చేయబడి, ప్రదర్శనమునందు జూపబడిన పలువిధములగు సిమెంటుపనులు, బ్రషులు, టోపీలు, బట్టలు, మొదలుగాగల వివిధపరిశ్రమలన్నియు, పరిశ్రమాభివృద్ధిని చాటుచునేయున్నవి.

విద్యావిషయమునగూడ ఈరాజ్యముకొంతవడియుండలేదు. నిర్బంధప్రారంభ ఉచితవిద్య నెలకొల్పబడినది

గదా! ఈప్రదర్శనమునందు "కిండరుగార్డెను" పనులు, "మాంటిసోరి" పద్ధతిప్రకారము విద్యాభ్యాపకముచే యుటకు అనువగు పరికరములు విశేషముగ ప్రదర్శింపబడినవి. ఈబరోడాపట్టణమునందు మూగవారికిని చెవిటివారికిని విద్య జెప్పుటకు ఒకపాఠశాలగలదు. ఆపాఠశాలయందు పిల్లలకు ఏయేసాధనములచే ఎటుల విద్యాభ్యాసమును చేయించుచున్నదియు ఇచట దృష్టాంతరూపమున ప్రదర్శించిరి. ఇంకొకచోట పిల్లలచే చేయబడిన కాగితపుపనులను అనంతముగ ప్రదర్శించిరి; ఇందు ఉత్తరము వ్రాసికొనుటకు "కవరు" మొదలుకొని, వండుకొనుటకు "స్టవ్" వరకును కాగితములోను అట్టలతోను చేయబడి చూపబడినవి.

చేతితోచేసి కంటితోచూచిన ఏవస్తువైన మనస్సునందు బాగుగనాటుకొనునని, ఇట్లు పిల్లలచేత అన్నివస్తువులను కాకితముతో చేయించుటయొక్క యభిప్రాయమై యున్నది. మఱియు స్త్రీలయొక్కయు, బాలికలయొక్కయు పాఠశాలలయందు చేయబడిన అనేకవస్తువులు, రవికలు, జాకట్టులు, చిన్నచొక్కాలుగూడ ఈవిద్యాశాఖయందే జూపబడినవి.

ఇంకొకచోట పలువిధములగు చిత్తరువులు ప్రదర్శింపబడియున్నవి. వేరొకచోట, విద్యుచ్ఛక్తిచే అన్నమును పిండివంటలను వండి జనులకందరికిని రుచిజూపుచుండిరి. ఒకచోట మైనపుబొమ్మలు జూపబడినవి; అందులో యశోదాదేవి తనయొడిలో శ్రీకృష్ణుని నిడుకొట్టుచు ఉయ్యాలయందు దూగుచున్నటుల ఒకచో ప్రదర్శింపబడినది. వేరొకచోట యశోదాదేవి పాలు పిదుకుచున్నట్లును, శ్రీకృష్ణుడాపాలను దొంగిలింప నిమిషనిమిషమును ప్రయత్నించుచున్నట్లును జూపబడినది. మరియొకచోట యశోదాదేవి పెరుగును చిలుకుచున్నట్లును, శ్రీకృష్ణుడా పెరుగుకుండనుండి వెన్నను దొంగిలించుచున్నట్లును జూపబడినది. ఈబొమ్మలన్నియు ఎల్లప్పుడును ఆయాపనులను జేయుచు, నిజముగ జీవముగలిగినవానివలెనే కనుపడుచుండును. వీనియందమును, నిర్మాణనైపుణ్యమును జూచి తీరవలసినదేగాని వర్ణింపవలవిగాదు. ఇంకను ప్రదర్శించిన చిల్లరవస్తువులన్నిటినిగుఱించి వ్రాసిన గొప్ప గ్రంథమేయగును.

## గ్రంథాలయ ప్రదర్శనశాఖ.

ఈశాఖయందు ప్రథమమున చెప్పదగినది బాలశాఖ. పిల్లలయొక్కబుద్ధిని వికసింపజేసి వారియాలోచనలయందు నూతనభావములను జొప్పింపగలిగినఆట లెన్నియో యిందు జూపబడినవి. మఱియుగుడ్డలమీదబొమ్మలతో అచ్చువేయబడి, ఆరుసంవత్సరముల వయస్సుగల పిల్లలకు హృదయాకర్షకముగ నుండు పుస్తకములొకచో జూపబడినవి. ఇట్లే పదిసంవత్సరములు వయస్సుగల పిల్లలకును పదునారు సంవత్సరములలోపు వయస్సుగల పిల్లలకును కావలసిన పుస్తకములను ప్రత్యేకముగ జూపిరి. పిల్లలమనస్సులను రంజింపజేయగలిగిన బొమ్మలు, పెద్దపెద్ద పటములు వర్ణింపనలవికానన్ని చుట్టును వ్రేలాడగట్టిరి. పిల్లలు బంకమట్టితో జేసిన బొమ్మలు ఒకచో జూపబడినవి. ఒక పెట్టెయందు ఇనుముతో జేయబడిన అనేకవస్తువుల విడిభాగములున్నవి. ఆపెట్టెకు "మెకానో" యని పేరు. ఆవిడిభాగములనుండి రైలుబండ్లు, ఓడలు, విమానములు మొదలగు ౧౨౦ రకములయంత్రములను పిల్లలు సులభముగా నిర్మించుకొనగలరు. దీనివలన బాలురయందు ఆలోచనాశక్తియు, నిర్మాణశక్తియు అభివృద్ధినొందునని వేరుగ చెప్పనక్కరలేదు. ఈబాలశాఖకుమధ్యను గ్రంథభాండాగారి నిలుచుని తాళములు వాయించుచు, లలితపదములతోగూడిన మృదుమధురములగు కీర్తనలను పాడుచు, పిల్లలనేగాక పెద్దలనుగూడ సాక్షి[illegible]ంచుచుండెను.

క్రొత్తగ్రంథాలయములను స్థాపించుకొనుటకై ఇరువదియైదు రూప్యములను మాత్రము ఇచ్చునట్టి గ్రామములకెల్ల శ్రీ గాయక్వాడుగారు ఉచితముగానిచ్చు నూరురూపాయిల విలువగల గ్రంథము లొక యలమారునందు పెట్టి బాలశాఖకు ప్రక్కనే ప్రదర్శించిరి. పిల్లలకు కావలసిన గ్రంథములు, వ్యవసాయదారునకు కావలసినగ్రంథములు, ఖులాసాగా చదువుకొనగోరువానికి గా

కలసిన గ్రంథములు, ఉపాధ్యాయులకు గావలసిన గ్రంథములు-స్త్రీలకు గావలసిన గ్రంథములు-ఇట్లు ఏతరగతి జనులకు కావలసిన గ్రంథముల నాయాతరగతులక్రింద, ప్రత్యేకముగా చిన్న చిన్న పెట్టెలయందు పెట్టి, ఒక్కొంటికి ౫౦ గ్రంథములుచొప్పున పెట్టి, జనులు చదువుకొనుటకై గ్రంథాలయములులేని గ్రామములకెట్లు పంపుచున్నారో వేరొకచోటజూపిరి. బరోడాయందున్న నాలుగుజిల్లాలయొక్క పెద్దపటములను వేఱొకచోట వ్రేలాడగట్టిరి; ఆ యాజిల్లాలయందున్న వివిధతరగతుల గ్రంథాలయములుగల గ్రామములను వివిధరంగుల నూదులచే జూపిరి. బరోడారాజ్యమునందు గ్రంథాలయోద్యమమును ప్రారంభించిన పిమ్మట గ్రంథాలయముల అభివృద్ధి ఎట్లున్నదో, అంతకు పూర్వమెట్లున్నదో చూపు పెద్దపటము నొకదానిని అందరకును బాగుగ గనపడునట్టి స్థలమునందు పెట్టిరి. దీనిక ప్రక్కనే పిల్లలచే తయారుచేయబడిన చిన్నవనము నొకదానిని ప్రదర్శించిరి.

వేరొక స్థలమునందు అమెరికా దేశమునందును, ఐరోపాదేశమునందును, ఇటలీదేశమునందును, జపానుదేశమునందును గల వివిధములగు జాతీయ గ్రంథాలయముల యొక్కయు, సార్వజనిక గ్రంథాలయముల యొక్కయు పెద్దపెద్ద పటములను వ్రేలాడ గట్టినారు. అమెరికా, ఐరోపాదేశములయందలి గొప్ప గ్రంథాలయముల భవనముల యొక్క ప్లానులనుగూడ తయారుచేసి వ్రేలాడ గట్టినారు. మిక్కిలి ప్రాచీనమైనట్టి గ్రంథాలయముల యొక్క పటములనుగూడ సంపాదించి చూపినారు. గ్రంథాలయముల యొక్క పటములన్నియు మొత్తము 3౨౮ గలవు.

మఱియు బరోడాయందున్న కేంద్రగ్రంథాలయమునకు కట్టబోవు నూతన భవనముయొక్క ఆకారమును జూపు పటములు కొన్ని ప్రదర్శింపబడినవి. బరోడా గాయక్వారుగారిచేసహాయముచేయబడుచున్న గ్రంథాలయముల భవనములయొక్క పదునాలుగు పటములను, పట్టణ గ్రంథాలయముల కుండవలసిన భవనముల యాకారములను జూపు అయిదు పటములను గూడ జూపిరి. పాశ్చాత్యదేశములయందెల్ల ప్రసిద్ధికెక్కిన వాషింగుటను, న్యూయార్కు, బర్కులీక, బోస్టను, సెంటులూయిసు, మ్యాంచెస్టరు, లివర్పూలు గ్రంథాలయముల యొక్క పటములు మిక్కిలి సుందరముగ నున్నవి.

మఱియొక స్థలమునందు గ్రంథాలయమున కుండవలసిన సామానులను జూపినారు. బల్లలు, కుర్చీలు, బీరువాలు, పత్రికలు పెట్టి ప్రదర్శించుటకనుకూలముగనుండు అలమరలు, స్తోత్రరకపు గ్రంథములపట్టికలు, పుస్తకములను-పెద్దగ్రంథాగారములయందు ఒకస్థలమునుండి మరియొకచోటికి దీసికొనిపోవుటకు చిన్నచిన్న బండ్లు, మొదలగువాని నెన్నిటనో ప్రదర్శించినారు. ఇంతేగాక ఉక్కుబీరువాలలో పలువిధములగువానిని ప్రదర్శించి వానియొక్క ఆధిక్యతనుగూర్చి బోధించిరి. పిల్లలుకూర్చుండుటకు అనుకూలముగనుండునటుల ఎత్తుతక్కువగనున్న కుర్చీలు, కుర్చీమీద కూర్చుని, చదువుకొనుచు వ్రాసికొనుటకు అనుకూలముగ నుండులాగున ప్రత్యేకముగ తయారుచేయబడిన కుర్చీలు- మొదలగువానిని కూడ ప్రదర్శించిరి.

గొప్పగ్రంథాలయములయందలి నిత్య వ్యవహారము జరుగుట కగత్యములగు అనేకసాధనములను విపులముగా వేరొకచోటజూపిరి. ఇంతేగాక సిరాబుడ్లు, అద్దుడు కాగితములదిమ్మలు, గుండునూదులు గుచ్చుకొని బల్లమీద పెట్టుకొను దిమ్మలు, కలములు, పలువిధములగు సిరాలు, రబ్బరుస్టాంపులు, తారీఖులు వేసికొను స్టాంపులు మొదలగు ఉపయోగకరములగు వస్తువులను విశేషముగ జూపినారు. ఇంతేగాక, అనేకవిధముల పుస్తకముల బైండింగులను-పదునారు, పదునేడుశతాబ్దములయందు చేసిన బైండింగుల నమూనాలను, ఈకాలమున చేయుచున్న బైండింగుల నమూనాలను చూపినారు. మఱియు తోలు క్యాలికో, వివిధములగు కాగితములు, జిగురు, మొదలగు బైండింగుసామానులనుగూడ విశేషముగ జూపిరి. మిక్కిలి ప్రాచీనములును అపూర్వములును అగు తాళపత్ర గ్రంథము లనేకములనుగూడ ప్రదర్శించిరి. భూర్జ

రపత్రములమీద వ్రాయబడిన మహాగాయత్రీభాష్యము యొక్కయు, దేవీసూక్తభాష్యముయొక్కయు వ్రాత ప్రతులు చూపబడినవి. మఱియు అరఅంగుళముపొడవు పాతికఅంగుళము వెడల్పుగలిగిన చిన్నగ్రంథములుగ ముద్రింపబడిన భగవద్గీత, కొరాను, షేక్స్పియరు నాటకములు మొదలగు గ్రంథములనేకములు ప్రదర్శింపబడినవి.

వ్యవసాయము, పరిశ్రమలు, కళలు మొదలగు శాస్త్ర విషయములనుగూర్చిన ౬౦౦ గ్రంథములు ప్రదర్శింపబడినవి. మరియు, ఈవిషయములనుగూర్చి వివిధదేశములయందు ప్రకటింపబడు పలువిధములగు పత్రికలనుగూడ ప్రదర్శించిరి. "క్రోక్" అను బొమ్మలను జూపు సినిమాయంత్రమును, ఒకమ్యాజిక్కులాంతరును, మామూలు పటములనన్నిటిని తెరమీద చూపించునట్టి "రేడియో అప్టికన్" అను యంత్రమును, పెద్దస్టిరియోస్కోపును, స్టిరియో గ్రాఫులను ఇరువదియంటిని ప్రదర్శించిరి. పుస్తక గ్రంథాలయములయందు అచ్చుపనులు అతిసులభముగా చేసికొనుటకు అనుకూలముగనుండునట్టి "రెంప్రింటర్" అను యంత్రమునుగూడ ప్రదర్శించిరి. ఈయంత్రమువలన అతిస్వల్పకాలములో వేలకొలదిప్రతులను దీసికొనవచ్చును. ఇన్నివిధముల గ్రంథాలయప్రదర్శనభాగము ప్రదర్శనముసకంతటికిని రాజమై యొప్పినదని చెప్పవచ్చును.

ఈప్రదర్శనమునందు ప్రతిదినమునందును రాత్రి 7 గంటలు మొదలు 9 గంటలవరకును సినిమెటోగ్రాఫు ప్రదర్శనముగూడ ఉచితముగా జూపబడినది. దీనిఖరీదు పదివేలరూపాయిలు. ఎల్లప్పుడును బరోడారాజ్యమునందు సంచరించుచు జనులను జ్ఞానవంతులుగ జేయుచుండును. ఇందు జూపబడు బొమ్మలతోబాటుగ వానికి సంబంధించిన విషయములనుగూర్చి ఉపన్యాసములనుగూడ ఇచ్చి, జనులనుద్బోధించుచుందురు. ఈసినిమెటోగ్రాఫు ప్రదర్శనమును జూచుటకై ప్రతినిత్యమును అనేకవేలమంది పురుషులును స్త్రీలునుగూడ విచ్చేసి యానందమునం దోలలాడుచుండిరి.

## గ్రంథాలయోద్యమము - బరోడా.

బరోడా సంస్థానాధీశులగు శ్రీ శాయాజీ గాయక్వాడీగారు ఆధునికకాలమున భరతఖండమందు గ్రంథాలయోద్యమమును స్థాపించుటయందు మార్గదర్శకులైయున్నారు. ౧౯౧౦ వ సంవత్సరమునం దీయుద్యమము మాదేశమునందు ప్రారంభమైనది. అమెరికాదేశమునందు విశేషయనుభవమును గలిగియున్నట్టి బోర్డనుదొరగారిని శ్రీవారు ఆవత్సరమునందు పిలిపించి కేంద్రగ్రంథాలయమును బరోడాపట్టణమునందు స్థాపించిరి. గ్రంథాలయోద్యమము సరియైన మార్గముల నడచునట్లు చేయుటకును, అందుబాటులోనున్న గ్రంథాలయములన్నియు అన్యోన్యాశ్రయములుగానుండునటుల చేయుటకును, ఈ కేంద్రగ్రంథాలయ ప్రతిష్ఠాపన స్థాపింపబడినది. శ్రీవారు స్వయముగా చదువుకొనుటకై వివిధ విషయములను గూర్చిన అమూల్యగ్రంథములను ౨౦,౦౦౦ లను సేకరించి తమస్వంత గ్రంథభాండాగారముగ ఉపయోగించుచుండిరి. ఈగ్రంథముల నన్నిటిని కేంద్రగ్రంథాలయమున కిచ్చివేసిరి; ఇప్పుడాగ్రంథాలయమున ఆంగ్లేయము, గుజరాతి, మహారాష్ట్రగ్రంథములు ౭౦,౦౦౦ లు గలవు. ఈగ్రంథములందు అపూర్వములును అమూల్యములును అగు గ్రంథము లనేకములుగలవు. గ్రంథములన్నియు నవీనశాస్త్రపద్ధతులప్రకారము వర్గీకరణము చేసి మంచిస్థితియందుంచినారు. ఈగ్రంథభాండాగారమునకు ఉన్నతాధికారిగ జె. యస్. కుడల్‌గారుగారున్నారు. వీరు అమెరికా ఐరోపా జపాను మొదలగు

పాశ్చాత్య దేశములకుబోయి పదునారుమాసముల కాలముగడపి, ప్రపంచమునందున్న గొప్పగ్రంథాగారములన్నిటినిజూచివచ్చిరి. ఈయుద్యమమునందు ఆయాదేశములందెల్లజనులు ఎట్లు అభివృద్ధిమార్గములను త్రొక్కుచున్నారో వారు స్వయముగజూచివచ్చి, ఆయాపద్ధతులనన్నిటిని ఇచట ఆచరణయందు బెట్టుటకై ప్రయత్నించుచున్నారు. వీరికి జీతము నెల ౧కి రు ౨౫౦ లు. వీరికి సహాయముజేయుటకై సహాయఉన్నతాధికారి గలరు. వీరిపేరు యం. ఎన్. అమీన్. బరోడాయందు రాజుగారు గ్రంథాలయోద్యమమును ప్రారంభించుటకుపు

ర్వమే వీరు అక్కడక్కడ గ్రంథాలయములను స్థాపించి పనిజేసియున్నారు. వీరికి జీతము నెల ౧కి రు ౧౫౦లు. ఇంతేగాక ఉన్నత గ్రంథభాండాగారి యొకడు గలడు. వీరికి జీతము నెల ౧కి రు ౩౫౦లు; సహాయగ్రంథభాండాగారులు ఆరుగురుకలరు. వీరికి నెల ౧కి జీతము రు ౭౫లు. ఇద్దరు గ్రంథభాండాగారిణులుగలరు. వీరికి నెల ౧కి రు ౫౦ల నిచ్చెదరు. ఒకసహాయగ్రంథభాండాగారిణిగలదు. ఆమెకు నెలకు ౨౦ రూపాయల నిచ్చెదరు. గ్రంథాలయోద్యమమునకు సంబంధించిన పనులను నిర్వర్తించుటకై పదునైదుమంది గుమాస్తాలు గూడ గలరు; వీరికి నలుబది రూపాయిలు మొదలు పదునేనురూపాయిలవరకును జీతమిచ్చెదరు. బంట్రోతులును చిల్లరపనులుచేయువారును కలసి ముప్పదిమందిగలరు. వీరికి ఆరుమొదలు పదిరూపాయిలవరకు జీతమిచ్చెదరు. ఈకేంద్రగ్రంథాలయము ఇప్పుడు నాలుగుఅంతస్థులు గల గొప్పమేడయందుంచినారు. ఈమేడ శ్రీ ప్రభువుగారిదేయైయున్నది. స్వంతభవననిర్మాణమునకై ప్రయత్నములు జరుగుచున్నవి. అచిరకాలముననే ఆరులక్షల రూప్యములు విలువగలిగినట్టి సుందర మందిరములను నిర్మించి, అందే కేంద్రగ్రంథాలయమునుంచెదరు. ఈగ్రంథాలయశాఖకు నెల ౧కి రు ౨,౫౦౦ లు ఖర్చుఅగును. పదునైదువేలరూప్యముల విలువగల నూతనగ్రంథములను ప్రతివత్సరమును గ్రంథాగారమునకు చేర్చుచుండెదరు. ఈగ్రంథాగారమునందు ప్రతినిత్యమును ౫౦౦ మంది చదువరులువచ్చి గ్రంథములను పత్రికలను చదువుచుండెదరు. ప్రతినిత్యమును ౨౦౦ మంది గ్రంథముల నిండ్లకు దీసికొనిపోవుచుండెదరు. ఈగ్రంథాగారమునందు పిల్లలకు ప్రత్యేకశాఖగలదు. ఈశాఖయందు పిల్లలు చదువుకొనుటకును చూచుటకును బొమ్మల పుస్తకములు విధివిరామముకేకుండనున్నవి. గోడలనన్నిటిని బొమ్మలతో అలంకరించియున్నారు. ఇంతేగాక పిల్లలు ఆడుకొనుటకు పలువిధములగు చక్కని ఆటలుగలవు. పిల్లలకు కథలుచెప్పుట, వివిధగ్రంథములందలి బొమ్మలను చూపించి బోధించుట, మంచిసంగతులను చదివి చెప్పుట మొదలగు పనులన్నియు స్త్రీగ్రంథభాండాగారిణులే నెరవేర్చెదరు. ఇంతేగాక బరోడాపట్టణమునగల స్త్రీసమాజములకుగూడ గ్రంథములనంపెదరు. ఈగ్రంథాలయమునుండి గ్రంథములను తీసికొనిపోగోరువారెవ్వరును ద్రవ్యమెంతమాత్రమియ్యనక్కరలేదు. ముప్పదిరూప్యములజీతమునకు మించినట్టి ఉద్యోగస్థుడుగాని, వృత్తిపన్ను నిచ్చువారుగాని, భూమిపన్ను నిచ్చువారుగాని, లేక న్యాయవాదివృత్తి నవలంబించినవారుగాని జవాబుదారిగానున్నయెడల అట్టివారికెల్ల గ్రంథముల నెరువిచ్చెదరు. గ్రంథములను పదునైదు దినములుంచుకొనవచ్చును.

ఉచితగ్రంథాలయముయొక్క లాభములను ఒక్క బరోడాపట్టణమునకేగాక, రాజ్యమునంతకును గూడ కలుగజేయవలెనని శ్రీ గాయక్వారు గారు ఈ యుద్యమమును ప్రారంభించినారు. ముందు బరోడారాష్ట్రమందున్న నగరములయొక్కయు పట్టణములయొక్కయు పెద్దపల్లెలయొక్కయు చిన్నపల్లెలయొక్కయు సంఖ్యను, వానియందున్న జనసంఖ్యను చదువరుల సంఖ్యను ప్రథమమున దెలిసికొనిరి. బరోడానగరముతో గలుపుకొని నాలుగు నగరములును ౩౯ పట్టణములును ౪౨౬ పెద్దపల్లెలును ౨౬౨౮ చిన్నపల్లెలును ఆరాజ్యమునందు ఉన్నట్లు లెక్క తేలినది. బరోడానగరమునందు కేంద్రగ్రంథాలయమును స్థాపించినారు గనుక మిగిలిన మూడునగరములందును, ఆనగరములు ముఖ్యపట్టణములుగాగల జిల్లాలందలి గ్రంథాలయములన్నిటికిని అందుబాటులో నుండునట్లుగా ౨౮,౦౦౦ పుస్తకములుగల గ్రంథాలయములుండునట్లును- ౩౯ పట్టణములలోను ఒక్కొక్కచోట ౫,౦౦౦ పుస్తకములుగల గ్రంథాలయములను స్థాపించుటకును- ౪౨౬ పెద్దపల్లెలలో ఒక్కొక్కచోట ౫౦౦ గ్రంథములుగల గ్రంథాలయముల నేర్పరచుటకును, మిగిలిన చిన్నపల్లెలయందొక్కొక్కచోట ౨౦౦ గ్రంథములుగల గ్రంథాలయముల నేర్పరచుకొనుటకును తీర్మానించి పనిజేయ నారంభించిరి.

అంతట కేంద్ర గ్రంథాలయముయొక్క అధికారము క్రింద ఈ గ్రంథాలయోద్యమమును బరోడా ప్రభుత్వమువారి పరిపాలనయందొక శాఖగ నేర్పాటుజేయ

బడినది. గ్రంథాలయములు పైనజెప్పబడిన ప్రకారము బరోడా రాజ్యమంతటను వ్యాపించి, వానివలన ప్రజలు నిజముగా నభివృద్ధిని బొందవలెనన్న, ప్రజలకు ముందు వానియందు అభిమానము గలుగవలెను. ఉచితముగా వచ్చినవస్తువునందు ప్రజలకంత యాదరణయుండదు. సొమ్మంతయు ప్రజలే ఖర్చుపెట్టి గ్రంథాలయములను స్థాపించుకొనవలయునని రాజు శాసించిన, ప్రజలయందు త్సాహము లేకపోవుటచేతను దారిద్ర్యముచేతను అట్టిపని సమకూడదు కావున ప్రజలయందు ఈ యుద్యమముపట్ల ఉత్సాహమును ఆదరణమును కలుగచేయుటకును, గ్రంథాలయములు స్థాపించినవారికి పుష్కలముగ సొమ్ములభించుటకును శ్రీ శాయాజీ మహారాజుగారు కొన్ని నియమముల నేర్పరచిరి.

ఏ గ్రామవాసులైన ఏబదిరూపాయిలను గాని, అంతకంటె తక్కువమొత్తమును గాని తమ గ్రామమునందు నూతన గ్రంథాలయమును స్థాపించుటకుగాను వసూలు జేసి, కేంద్ర గ్రంథాలయమువారికి దెలియపరచినయెడల పంచాయితినుండి ఏబదిరూప్యముల నిప్పించి, తామేబది రూపాయిలనిచ్చెదరు. అనగా నూతనగ్రంథాలయమును స్థాపించుకొనుటకై ఏగ్రామవాసులైన ఏబదిరూపాయిల విరాళమును వసూలు జేసుకొనినమాత్రాన నూరు రూపాయిల విరాళమువచ్చును. ఇంతేకాక, ఇరువదియైదు రూపాయిల నిచ్చిన నూరు రూపాయిలు విలువగల దేశభాషాగ్రంథములను కేంద్ర గ్రంథాలయమువారా గ్రంథాలయమునకు బహుమతిగానిచ్చెదరు. బరోడా రాజుగారి దివానుగారిచే నేమింపబడిన ముగ్గురుపెద్దలు గలిగిన సంఘమువారీ బహుమతి గ్రంథములను నిర్ణయించెదరు. ఆగ్రంథములను జనులెల్ల చదువుకొనుటకు వాకునుగలిగియుందురు. ఇతరనిబంధనలను ఆ యా గ్రంథాలయముల వారేర్పరచుకొనవచ్చును. కేంద్ర గ్రంథాలయమునుండి పంపబడు సంచారపుస్తకముల పెట్టెలనుగూడ, ఈ గ్రామ గ్రంథాలయములు తెప్పించుకొనవచ్చును. ఇట్టి గ్రంథాలయమునకు గ్రామగ్రంథాలయమని పేరు. దేశభాషాగ్రంథములు గలిగిన పెట్టెలను మాత్రము ఈ గ్రామ గ్రంథాలయముల కంపెదరు.

నాలుగు వేలకంటె ఎక్కువ జనాభాగలిగిన గ్రామములు రు ౩౦౦ లనుగాని అంతకంటె తక్కువసొమ్మునుగాని సంవత్సరమునకు వసూలు జేసికొనిన పంచాయితినుండిగాని మునిసిపాలిటీనుండిగాని సంవత్సరమునకు రు ౩౦౦ లను, కేంద్ర గ్రంథాలయశాఖవారు సంవత్సరమునకు రు ౩౦౦ లను ఒసంగెదరు. ఇట్టి గ్రంథాలయములకు పట్టణగ్రంథాలయములని పేరు. ఆంగ్లేయభాషాగ్రంథములు గలిగిన సంచారపుస్తకముల పెట్టెలను గూడ ఈ పట్టణగ్రంథాలయముల కంపెదరు. ఇట్టి పట్టణగ్రంథాలయము, దానికిదగ్గరనున్న గ్రామ గ్రంథాలయములకు సంబంధించిన వ్యవహారములను జూచుచు ఆయా గ్రామములకు సంచారపుస్తకముల పెట్టెల నందుబాటు చేయుచుండవలెను. ఒక గ్రామమునందుగాని పట్టణమందుగాని ఒకటికంటెనెక్కువ గ్రంథాలయములను స్థాపింపవలసిన యావశ్యకతనుగూర్చి కేంద్ర గ్రంథాలయమువారే యోచించెదరు.

ఏ జిల్లావారైన ఆజిల్లా ముఖ్యపట్టణమునందు జిల్లా కేంద్ర గ్రంథాలయమును స్థాపింపదలచి, సంవత్సరమునకు రు ౨౦౦ లను వసూలు చేయగలిగినయెడల, పంచాయితీనుండిగాని మునిసిపాలిటీనుండిగాని సంవత్సరమునకు రు ౨౦౦ లను, కేంద్ర గ్రంథాలయశాఖవారు రు ౨౦౦ లను విరాళముగ నిచ్చెదరు. జిల్లా గ్రంథాలయము ఆజిల్లాయందున్న గ్రంథాలయములన్నిటిమీదను అధికారమును గలిగియుండును. ప్రభుత్వమువారి సహాయమును పొందుచుండు గ్రంథాలయములన్నియు కేంద్ర గ్రంథాలయ పరిపాలనకు లోబడియుండును. ఏగ్రంథాలయమైన స్వంతభవనమును నిర్మింపదలచుకొని అందుకు కావలసిన సొమ్ములో మూడవ వంతును వసూలు జేసికొనినయెడల, మిగిలిన రెండువంతులలో ఒక వంతు సొమ్మును పంచాయితీయును మరియొక వంతు సొమ్మును కేంద్ర గ్రంథాలయమువారును ఇచ్చెదరు. ఆభవనముల యొక్క ప్లానులను మాత్రము కేంద్ర గ్రంథాలయమువారంగీకరింపవలెను.

గ్రామ గ్రంథాలయములు వారమునకథమము పదు

నాలుగుగంటలైన తెరచియుంచవలెను. శెలవుదినముల యందు రెండు గంటలకంటె ఎక్కువకాలమే తెరచియుంచవలెను. పట్టణగ్రంథాలయమును జిల్లా గ్రంథాలయమును ప్రతిదినము ౬ గంటలకు తక్కువగాకుండ తెరచియుంచవలెను.

గ్రామ గ్రంథాలయము పట్టణగ్రంథాలయమునకు మూడుమాసముల కొకసారి, దానిపనిని తెలియజేయునట్టి రిపోర్టునంపవలెను. పట్టణగ్రంథాలయము దానిపనిని, గ్రామ గ్రంథాలయముల పనిని తెలియజేయునట్టి రిపోర్టును మూడుమాసముల కొకసారి జిల్లా గ్రంథాలయమునకంపవలెను. జిల్లా గ్రంథాలయము దానిపనిని, దాని క్రిందఉండిన గ్రామ, పట్టణగ్రంథాలయముల పనిని తెలిజేయునట్టి రిపోర్టును మూడుమాసముల కొకసారి కేంద్ర గ్రంథాలయమునకంపవలెను. ఒక జిల్లాయందు పట్టణగ్రంథాలయములు లేనప్పుడు, గ్రామ గ్రంథాలయములు జిల్లా గ్రంథాలయముతోనే ఉత్తరప్రత్యుత్తరములను జరుపుకొనవచ్చును. ఒక జిల్లాయందు జిల్లా గ్రంథాలయముకూడ లేకుండిన, ఆజిల్లాయందున్న గ్రామ గ్రంథాలయములు కేంద్ర గ్రంథాలయముతోనే ఉత్తర ప్రత్యుత్తరములను జరుపుకొనవచ్చును.

ప్రభుత్వమువారి సహాయమునుపొందుచుండు గ్రంథాలయములన్నియు వాని ఆదాయమును ఈక్రిందివిధముగ వ్యయపరుపవలయును:—

| | |
|---|---|
| గ్రంథములు కొనుటకు | నూటికి ౨౫ వంతులు. |
| పత్రికలుకొనుటకు | నూటికి ౩౦ వంతులు. |
| అద్దెలు, సామానులు | నూటికి ౨౦ వంతులు. |
| ఇతర ఖర్చులు | నూటికి ౨౫ వంతులు. |

అనగా ఒక గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు. ౧౦౦ లు ఆదాయము వచ్చుచుండినయెడల, పైన వివరింపబడిన వంతుల ప్రకారము ఖర్చుపెట్టుకొనవలెను.

గ్రామ గ్రంథాలయములు పల్లెయందుండు ఉపాధ్యాయుని స్వాధీనమునందుగాని ఇతర పెద్దమనుష్యుని స్వాధీనమందుగాని ఉండును. పట్టణగ్రంథాలయము ఒక భాండాగారిని ఇతర నౌకరులను ఏర్పరచుకొనును. గ్రంథాలయమంతయు భాండాగారియొక్క స్వాధీనమందేయుండు; దాని పరిపాలనకంతకును అతడే బాధ్యుడైయుండును. జిల్లాగ్రంథాలయమునకు ఇతర నౌకరులే గాక, కొందరు గుమాస్తాలుకూడ నుందురు. అవసరమునుబట్టి ఒకరుగాని అంతకంటె ఎక్కువమందిగాని భాండాగారులు ఉందురు. ప్రధాన భాండాగారి గ్రంథాలయశాస్త్రము నభ్యసించి, జిల్లాయందున్న గ్రంథాలయముల పరిపాలనకు జవాబుదారిగ నుండును. జిల్లా, పట్టణ, గ్రామ గ్రంథాలయములన్నిటినికూడ, మున్సిపలుకంటె ఎక్కువయు తాలూకాబోర్డుకంటె నెక్కువయు కాని గ్రామస్థులు కార్యనిర్వాహక సంఘముగనేర్పడి పరిపాలించెదరు. ఆయా గ్రంథాలయముల యొక్క చందాదారులు ఆయా గ్రంథాలయములకు ప్రతిసంవత్సరమును కార్యనిర్వాహక సంఘమునెన్నుకొనెదరు. క్రొత్తసంఘమును ఎన్నుకొనునంతకును పాతసంఘమే పనిజేయుచుండును. సంవత్సర మధ్యమున కార్యనిర్వాహక సంఘమునందు వచ్చిన ఖాళీలన్నియు, ఆ సంఘమువారే పూర్తిపరచుకొనెదరు. ప్రతిగ్రంథాలయమును దానిపరిపాలనకు కావలసిన నిబంధనలన్నిటిని అదియే నిర్మించుకొనవచ్చును. అట్లునిర్మించుకొన్న నిబంధనలకు నకలును గ్రంథాలయశాఖాధ్యక్షునకు బంపవలయును.

ప్రభుత్వమువారి సహాయమును పొందుచున్న గ్రంథాలయములన్నిటిని జాతి, మత, విచక్షణలేకుండ సర్వజనులు ఉపయోగించుకొనవచ్చును. ఒక పట్టణమునందుగాని పల్లెయందుగాని ఒక గ్రంథాలయమునకుమాత్రమే ప్రభుత్వమువారు సహాయముచేసెదరు. ఏ గ్రంథాలయమైన సరిగ పనిజేయుటలేదని తోచినప్పుడు, అట్టి గ్రంథాలయమునకు చేయుసహాయమును తీసివేసెదమని ప్రభుత్వమువారు ఒక సంవత్సరమునకు ముందుగా ఆ గ్రంథాలయమునకు తెలియ బరచెదరు. ఈ సంవత్సరమునందు ఆగ్రంథాలయము తిరిగి మంచిస్థితికి వచ్చిన

యెడల, ప్రభుత్వమువారి సహాయమును తీసివేయరు. ఇట్లు సహాయమును పొందు గ్రంథాలయములన్నియు ప్రభుత్వమువారి అధికారమునకు లోబడియేయుండును. ఏజిల్లా పంచాయితీయైన గ్రంథాలయములకు సంబంధించినపనులకు వినియోగించుటకుగాను ప్రజలమీద పన్నులనువిధింప దలచినయెడల, ప్రభుత్వమువారు అచటి స్థితిగతుల నాలోచించి అనుజ్ఞనొసంగెదరు. అట్టిపన్నును చదువను వ్రాయను సమర్థతగలిగిన మనుజులందరి మీదను, ఒక్కొక్కనికి ఒకఅణా లేక రెండు అణాలు చొప్పున విధించెదరు.

ఈ పద్ధతుల ననుసరించి ఇప్పటివరకును బరోడాలోని కేంద్ర గ్రంథాలయముగాక ౪౦౦ గ్రామగ్రంథాలయములును, ౩౯ పట్టణగ్రంథాలయములును ౩ జిల్లా గ్రంథాలయములును స్థాపింపబడియున్నవి. ఆరాజ్యమునందు ౪౦౦౦ కన్న నెక్కువ జనసంఖ్యగల పట్టణములు ౩౯ మాత్రము గలవు. ౧,౦౦౦ కన్న నెక్కువ జనసంఖ్యగల గ్రామములు ౪౨౬. బరోడా రాజ్యము యొక్క జనసంఖ్య ౨౦ లక్షలు మాత్రమే.

గ్రంథాలయములులేని గ్రామములందలి ప్రజలును, చిన్నగ్రంథాలయములవారును, పుస్తకములు కావలెనను వాంఛను తెలియజేసినయెడల సంచారగ్రంథములనుంచిన పెట్టెలను ఆయాగ్రామములకంపెదరు. ఒక్కొక్కపెట్టెయందు ౧౫ మొదలు ౩౦ వరకు గ్రంథములనుంచెదరు. ఉపాధ్యాయులు, వ్యవసాయదారులు, పిల్లలు, స్త్రీలు మొదలుగాగలవారికి వారిరుచుల కనుగుణ్యములగు గ్రంథములను జాగ్రత్తగ నాలోచించి ప్రత్యేకముగ పెట్టెలయందుంచి, కట్టుదిట్టముగ గట్టి ఆయాగ్రామములకంపెదరు. ఆపుస్తకములు మూడుమాసములవరకు ఒక గ్రామమునందుండవచ్చును. అటుపిమ్మట తమగ్రామమునందున్న కాలమున ఎన్నిగ్రంథములు గ్రామస్థులకొసంగబడినవో, ఏవిధములగు గ్రంథములను జదివిరో, ఎంతమంది చదివిరో ఈవిషయములను తెలియజేయు నివేదికతో, కేంద్రగ్రంథాలయాధికారికి ఆగ్రంథముల పెట్టె నంపివేయవలెను; ఉపయోగింపబడిన గ్రంథముల ననుసరించి తిరిగి గ్రామస్థులకు వారిరుచుల కనుగుణ్యములైన గ్రంథముల పెట్టెలను ఆగ్రామములకు పంపుచుండెదరు.

గ్రంథాలయములు చక్షురసంయోగమువలననేగాక నిరక్షరకుక్షులకుకూడ జ్ఞానదాయకములుగా నుండవలెను. జ్ఞానమును ఆహ్లాదముతో ప్రజలు సంపాదించుకొనుటకుదగిన సదుపాయము లుండగలయును. ఇందులకుగాను సినిమెటొగ్రాఫులను, స్టీరియాస్కోపులనుకొని ఆరాజుగారు కేంద్రగ్రంథాలయశాఖకొసంగిరి. ఈశాఖోద్యోగులు ఈయంత్రములను తీసికొని రాష్ట్రమందలి గ్రామములకెల్లబోయి, ఈమూలమున దేశమందు జ్ఞానమును వెదజల్లుచున్నారు.

గ్రంథాలయములను పరిపాలనచేయుటకు తగినజ్ఞానము ప్రత్యేకఅభ్యాసమువలననేగాని యలవడదు. పాశ్చాత్యదేశములం దిదియొక ప్రత్యేకశాస్త్రమై విరాజిల్లుచున్నది. అనుభవమువలన ఈశాస్త్రమునందు నేర్పుకలిగిన సంగతులనంతముగలవు. అందుచేత బరోడా కేంద్ర గ్రంథాలయ సంస్థాపన కనుబంధముగ గ్రంథాలయసంఘము నొకదానిని ౧౯౧౩ సంవత్సరము ఏప్రియలు నెలయందు స్థాపించిరి. ఇందు భాండాగారికులు తఱచుగాచేరి తమతమ యనుభవములను పరస్పరము దెలుపుకొనెదరు. గ్రంథపరిశోధనాంశములనుగూడ చర్చింతురు. గ్రంథాలయ నిర్వాహణము ప్రత్యేకశాస్త్రము. దాని నభ్యసింపజేయుటకు విద్యార్థివేతనములనిచ్చి ప్రత్యేకముగా ఒకపాఠశాలను ఏర్పరచి కొంతమంది నాశాస్త్రమునం దారితేరినవారుగ జేసిరి. ఇట్లు బరోడారాష్ట్రమందలి ప్రతిపట్టణమందును పల్లెయందును ప్రతిమనుజునకును జ్ఞానము దేవదత్తమగు వాయువువలెను నీటివలెను సమృద్ధిగను వెలలేకను లభించుటకై గ్రంథాలయమును వానికంగములుగ వివిధశాఖలను, ఆమహారాజు స్థాపనజేసెనుగదా! అంతటితో తృప్తినొందక తమ యనుభవములను తాముస్థాపించిన ప్రతిష్ఠాపనలయొక్క కార్యక్రమమును ఇతరరాష్ట్రములవారలుకూడ నేర్చుకొని లాభముపొందుటకై తమబొక్కసమునుండి విశేష ధనవ్యయమునుజేసి సర్వాంగసుందరమగు త్రైమాసిక

పత్రికను మూడుభాషలయందు ప్రచురించునట్లు చేయుచున్నారు. ఆపత్రికం బోధచేయుచున్న విషయములే మనదేశమం దిట్టి యుద్యమ స్థాపనకు మార్గదర్శక మయినవి.

బరోడారాజ్యమున జరుగుచున్న పనిని జూచినవారై అమెరికా సంయుక్తరాష్ట్రముల గ్రంథాలయసంఘము వారు గాయక్వాడీగారిని గ్రంథాలయశాఖాధ్యక్షులగు కుడ్హోల్కరుగారిని తమసంఘమందు గౌరవసభ్యులుగా జేర్చుకొనిరి.

ముగింపు.

బరోడాగ్రంథాలయ శాఖాధ్యక్షులగు శ్రీకుడ్హోల్కరుగారికి ఆంధ్రదేశగ్రంథాలయోద్యమమందు గల యభిమానము కడుమెండు. వారు మనయుద్యమమునుగూర్చితరుచు జాబులముఖమున సంబాయిషీని తెప్పించుకొని దానిని వారపత్రికయందు ముద్రించుచున్నారు. దూరమునుండి వారిచే జూపబడుచున్న ప్రేమతో తృప్తినొందక స్వయముగా వారినిజూచివచ్చితిని. నేను బరోడా యందున్నకాలమున శ్రీకుడ్హోల్కరుగారును, లైబ్రరీ మిసలేనీ సహాయసంపాదకుడగు దాదా ఖాంజీగారును, ప్రదర్శనమునుజూచుటయందేమి, కేంద్రగ్రంథాలయమును దర్శించుటయందేమి, ఇంకను ఇతరవిషయములయందేమి అమితమగుసహాయమును జేసియుండిరి. ఇంతేగాక కేంద్రగ్రంథాలయ సంచారగ్రంథభాండాగార శాఖాధ్యక్షులగు యన్. సి. దివాంజీగారు నాకాతిథ్యమిచ్చి నేనక్కడ ఉన్న దినములు సుఖవంతములును సంతోషదాయకములును అగునటుల జేసిరి. వారికెల్ల కృతజ్ఞుడను. బరోడానుండి తిరిగి వచ్చునప్పుడు బెజవాడ యందున్న రామమోహన ధర్మపుస్తక భాండాగారమునందు బాలశాఖ నేర్పాటుచేయుటకు కావలసిన పుస్తకములు ఆటలు మొదలగువానినెల్ల బొంబాయినుండి తీసికొనివచ్చితిని; తీసికొని వచ్చుటయేగాక ౧౭-౨-౧౭ నేడీన బాలశాఖనుగూడ ఏర్పాటుచేసితిమి.

—అయ్యంకి వేంకట రమణయ్య.

# గ్రంథ భాండాగారము.

సీ. తులలేని జ్ఞానవస్తువును జూపింపంగఁ దేజరిల్లెడు మహాదీప మెద్ది
సకలరాష్ట్రపు సమాచారముల్ దెలియంగ నలరెడు కరతలామలక మెద్ది
సర్వదేశముల పూజ్యతఁ గాంచు భారతీదేవికి రంగప్రదేశ మెద్ది
ఇది మంచి దిద్ది చెడ్డది యంచు శాస్త్రజనులకుఁ దెల్పు నాచార్యుఁ డెద్ది

గీ. అట్టి పుస్తక భాండాలయమ్ము వలనఁ । గలుగు లాభముల్ వచియింపఁగాఁ దరంబె
గాన విద్యాభివృద్ధికిఁ బూనవలయుఁ । దప్పకిప్పుడు నాంధ్రసోదర్యులార.

ఉ. జ్ఞానముకన్న మేల్ధనము గానఁగ రాదు ధరాతలంబునన్
దానికి సాధనంబయి గనంబడు విద్దియ గ్రంథమందిరా
ధీనము గాన నాంధ్రులకు దీనియవశ్యత నచ్చఁజేసి వి
జ్ఞానముఁ గూర్చుమంబ! యనిశంబును దేశ్యభివృద్ధిగాంచగన్.

—జంధ్యాల వేంకటశివకవులు.

# యుద్ధభటులకు గ్రంథాలయములు

ఇప్పుడు జరుగుచున్న ఘోరసంగ్రామమునందు యుద్ధభటులకు, ప్రతినిత్యమును తమ నిర్ధారిత కృత్యములను జేసి విశ్రాంతిని పొందు సమయములందు ఉబుసుపోక యున్నది. పగలెల్ల కష్టపడి పనిజేసి సాయంకాలమున బసకు వచ్చుసరికి, చదువుకొనుటకు కొన్ని గ్రంథములును సచిత్రములతో గూడిన మాసపత్రికలును యుద్ధభటున కందిచ్చిన, వానికి ఉల్లాసకరముగను ఉత్సాహకరముగను ఉండును గదా. ఈసూత్రమును గనిపెట్టి, ఆంగ్లేయులు యుద్ధమును జేయు భటులకెల్ల పుస్తకములను, పత్రికలను అందజేయుటకు బూనుకొనిరి. ప్రథమమున కొందరు పెద్దలు జేరి, కొన్ని గ్రంథములను ప్రోగుజేసి "వెస్టుమినిస్టరు"నందు ఈపనికి బూనిరి. ఆరంభమున 30,000 ల గ్రంథములు కావలెనని ప్రకటించిరి. స్త్రీలు ఇంటింటికిని దిరిగి గ్రంథములను సేకరించిరి. ప్రతిదినమును తపాలాద్వారాను, రైలుద్వారాను, మనుష్యుల ద్వారాను పుస్తకముల కట్టలు రానారంభించెను. ఇటుల స్వల్పకాలమునకే ఔదార్యవంతుల సహాయమువలన ఈ ముప్పదివేల గ్రంథములును లభించినవి. ఈగ్రంథములను రైల్వే కంపెనీలవారు వల యుద్ధస్థలములకెల్ల ఉచితముగ దీసికొనిపోయిరి.

ఇటుల ప్రోగుజేయబడిన పుస్తకములన్నిటిని దులిపి చీట్లనతికించి కనడా దేశమునుండి వచ్చినభటులకు ప్రథమమున పంపిరి. పుస్తకముల నెరువిచ్చుటకు కఠినమైన నిబంధనలను వేయక, గ్రంథముయొక్క నామము, తీసికొనినవారి పేరు, తేదీలను వ్రాయించి పుస్తకముల నిచ్చుచుండిరి. కనడా యుద్ధభటులకు పుస్తకముల నిచ్చుచుండగనే, ఈజిప్టుదేశమునందు విడిసియున్న ఆస్ట్రేలియా-న్యూజీలండు యుద్ధభటులనుండి గ్రంథములకొరకు ఆహ్వానము వచ్చినది. వెంటనే వారికి కావలసిన గ్రంథములును, సచిత్రమాసపత్రికలును పంపబడినవి.

ఇట్లు ప్రారంభింపబడిన పనియొక్క ఉపయోగమును ఆయాప్రదమును జూచి, ఆంగ్లేయదేశముయొక్క సేనలు పనిజేయుచున్న స్థలములకెల్ల పుస్తకములను పత్రికలను పంపుట కేర్పాటుచేసిరి. సేనలన్నియు, పట్టణములకును గ్రామములకును గూడ దూరప్రదేశములయందు విడిసియుండును. అందుచేత యుద్ధభటులకు సంతోషమును గలుగజేయు వినోదము లెవ్వియు అచట ఉండుట అసంభవము. ఇంతేగాక కందకములలోనుండు యుద్ధభటులలో ఎల్లప్పుడును నాలుగవవంతు భటులు మాత్రము యుద్ధకార్యములను నిర్వర్తించుచుండెదరు. మిగిలిన మూడువంతుల జనులును కందకములకు అడుగుభాగమున విశ్రాంతిని దీసికొనుచుండెదరు. అందుచేత ఈమూడువంతుల జనులును ఎల్లప్పుడును కందకములయందే తమకాలమును గడుపుచుండవలసిన స్థితియందు, వారికి కాలము గడుచుట యెంతకష్టముగానుండునో ఊహింపవలసినదేగాని వ్రాయనలవిగాదు. అట్టివారు గ్రంథములనో పత్రికలనో చదువుచుండుటవలన అవకాశము గలిగి వారెల్లప్పుడును ఉల్లాసవంతులై యుందురు.

అందుచేత వారికిగూడ గ్రంథములనంపుట అగత్యమయ్యెను. అంతట గ్రంథములకొరకును పత్రికలకొరకును దేశస్థులకెల్ల విజ్ఞాపనలంపిరి. వెంటనే పుస్తకములవర్షము కురియనారంభించెను. దేశమునందచ్చటచ్చట పుస్తకములను వసూలుజేయుటకు స్థలముల నేర్పరచిరి. ఆ యా స్థలములకు తగినన్ని గ్రంథములు రాగానే వాని నన్నిటిని ప్రధాన కార్యాలయమునకంపుచుండిరి. ప్రధాన కార్యాలయమునుండి ఆయా దేశములయందున్న యుద్ధభటులకంపుచుండిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట, గ్రంథములు యుద్ధభటులకు జేయుచున్న సహాయమును స్వయముగా జూచినవాడై తపాలాశాఖాధ్యక్షుడుకూడ ఈయుద్యమమునకు సహాయభూతుడగుటకు నిశ్చయించుకొనెను. ఏగ్రామమునందైన సరియే, ఒక గ్రంథమునుగాని,

సచిత్ర మాసపత్రికనుగాని యుద్ధభటులకొరకై తపాల కచ్చేరియందుండు అధికారికిచ్చినయెడల దాని నాతడు ఖర్చులేమియులేకుండగ ఉచితముగనే యుద్ధభటులకంపు ప్రధాన కార్యాలయమునకు తపాలాద్వారా పంపును. ఈప్రకారము ఎన్నిగ్రంథములను తపాలాఫీసులందిచ్చినను అవియన్నియు యుద్ధభటులకు పోయిచేరును. ఈసహాయమువలన జనులు ఇంకను ఎక్కువగ్రంథములంపుట సులభమయ్యెను. ఈమహాకార్యమును నిర్వహింపుటకు పుస్తకములేగాక ధనమును ఆవశ్యకమయ్యెను. ఔదార్యవంతులు విరాళముల నొసంగి ధనలోపమును గూడ లేకుండ జేసిరి.

యుద్ధ గ్రంథాలయము.

ఇంతేగాక "స్త్రేహాము"నందు యుద్ధగ్రంథాలయము నొకదానిని గూడ స్థాపించిరి. ఈ యుద్ధగ్రంథాలయము నుండి గాయములు తగిలిన యుద్ధభటులుగల ఆసుపత్రులకు ఆసుపత్రి మోడలకు కావలసిన గ్రంథములనెల్ల పంపుచుందురు. ఆంగ్లేయదేశమునందే గాక ఫ్రాన్సుదేశము నందున్న ఆసుపత్రులకు గూడ గ్రంథములనంపెదరు. ఇంతేగాక "మాల్టా" "అలెగ్జాండ్రియా" మున్నగు ప్రదేశములకుకూడ అమితముగ గ్రంథములనంపిరి. యుద్ధము చేయుచున్న ఓడలమీదనున్నట్టి వారికిగూడ వలయుగ్రంథముల నంపుచుండిరి. ఈయుద్ధ గ్రంథాలయమునకు గూడ జనులు అసంఖ్యాకములగు గ్రంథముల నంపుచుండిరి. తపాలాద్వారా వచ్చిన "పార్సిల్సు"గాక ౫౦౦ పెట్టెల గ్రంథములు ఒకేదినమున వచ్చినవి. కొందరు పనికిరాని గ్రంథములనుగూడపంపుచువచ్చిరి. కాని అట్టివి బహుస్వల్పము. యుద్ధభటులకు ముఖ్యముగా నవలలును, సచిత్ర మాసపత్రికలును ఆవశ్యకములైయున్నవి. ఇతర విధములగు గ్రంథములను కొందరు చదివెదరు. కాని అట్లు చదువువారు కొద్దిమంది. ఈగ్రంథాలయమునకు వచ్చు సచిత్ర మాసపత్రికలయొక్క చినిగిపోయినకాగితములను బాగుచేయుటకును బరువు తగ్గునటుల ప్రకటన పత్రికలుగల కాగితములను మాసపత్రికలనుండి తీసివేయుటకును ముగ్గురు స్త్రీలు ఎల్లప్పుడును పనిచేయుచుందురు. ఆయాస్థలములనుండి యుద్ధభటులకై పంపబడిన గ్రంథములయందప్పుడప్పుడు అపూర్వ గ్రంథములుగూడ కన్పట్టుచుండును. అట్టి అపూర్వ గ్రంథములను అమ్మి యుద్ధభటులకు కావలసిన ఇతరగ్రంథములను కొనెదరు. ఈయుద్ధ గ్రంథాలయముయొక్క పనులను నిర్వర్తించుటకై కావలసిన సొమ్మును అంతను ఇద్దరు మహనీయులిచ్చుచుండిరి. ఇట్లు ఆంగ్లేయులు, యుద్ధభటుల మనస్సులెప్పుడును ఉత్సాహమయములు, ఆనందమయములుగానుండుటకు అనేకవిధముల పాటుపడుచున్నారు.

# అమెరికాదేశము—గ్రంథాలయ ప్రదర్శనము.

౧౯౧౫ సం॥న "సాన్ ఫ్రాన్సిస్కో" నగరమున జరిగిన "పెనామా పసిఫిక్ ఎక్స్పొజిషను" నందు అమెరికాదేశ గ్రంథాలయ సంఘమువారు గ్రంథాలయ ప్రదర్శనమును జూపిరి. "క్యాలిఫోర్నియా" రాష్ట్రమున గల గ్రంథాలయముల పద్ధతిని జూపు గొప్పపటము నొకదానిని తయారుజేసిరి; ఇది నలుబది అడుగులు ఎత్తునుగలిగి గోడయంతయు నాక్రమించియున్నది; ఆరాష్ట్రము ఒక్కదానియందును జరుగుచున్న గ్రామ గ్రంథాలయములపనియంతయు అందు జూడనగును. ఈప్రదర్శనమునందు జూపబడినబాలశాఖ మిక్కిలి హృదయాకర్షకముగ నున్నది. చిన్నపిల్లలకు హృదయాకర్షకముగ నుండిన బొమ్మల పుస్తకములను ముందు భాగమునం దుంచిరి. వానికి తరువాత వరుసగానున్న ఏడుమంచెలయందు పిల్లలలో చిన్నవారికిని పెద్దవారికిని ఉపయుక్తములగు గ్రంథములనుంచిరి. వారికి ప్రత్యేకము అనువుగనుండునట్టి కుర్చీలు బెంచీలు మొదలగునవికూడ ఏర్పాటుచేయబడినవి. ప్రతిదినమును పిల్లలయొక్క తలిదండ్రులు, సోదరులు, సోదరీమణులు, అత్తలు, మామలు మొదలగు వారందరును విచ్చేసి—

సద్గ్రంథములను సేకరించి అందరికిని గ్రంథాలయము లెట్లు అందజేయుచున్నవో కొంచెము చూడగలిగిరి. బాలశాఖలయొక్కయు, కథలు చెప్పుటయొక్కయు- గ్రంథాలయములు పఠనమందిరములు చేయుచున్న ఇతర పనులయొక్కయు ఫొటోగ్రాఫులు గోడలమీద అలంకరింపబడియున్నవి. పాఠశాలలకు గ్రంథాలయము లెటుల ఉపకరింపవలయునో అచ్చట జూపబడినది. గోడల మీద అంటింపబడిన పటములు జనులను అమితముగ ఆకర్షించినవి.

ఆదర్శప్రాయముగ చేసికొనదగిన ఒక పట్టణమునందు కేంద్ర గ్రంథాలయ శాఖలయొక్క పద్ధతులు ఎటుల నిర్వహింపబడుచున్నవియో ఒక పటమునందు జూపిరి. ఇంకొక పటమునందు శాఖలు చేయుచున్న పనినిజూపు ఫొటోగ్రాఫులను దీనికిప్రక్కనే ప్రదర్శించిరి. గొప్పపట్టణములయందు నివసించునట్టి జనులుగూడ తమ పట్టణములయందున్న కేంద్ర గ్రంథాలయములు గాని శాఖల సహాయమువలన ఎట్టిపని నిర్వహించుచున్నవియు ఆనివరకు తెలియక ఈప్రదర్శనమునందు జూచి ఆశ్చర్య నిమగ్నమానసులైరి. ఇతరప్రదేశములనుండి విద్యాగ్రాహము నకువచ్చువారలకు, గ్రుడ్డివారలకు, కళాశాస్త్ర వేత్తలకు సంగీత ప్రియులకు, వర్తకులకు, శాస్త్రకారులకు, వివిధ తరగతుల విద్యార్థులకు వారు వీరననేల, సర్వజనులకు గ్రంథాలయము లెటుల ఉపకరించుచున్నవో వేరొకచో జూపిరి.

ఇంకొక భాగమునందు వివిధరకముల గ్రామ గ్రంథాలయములు జూపబడినవి. అందే "మస్సచూసెట్ట్సు" అను భాగముయొక్క పటమున అందున్న గ్రంథాలయముల పటములు వేయబడినవి. దానికి ప్రక్కనే "క్యాలిఫోర్నియా" యందొక భాగమున ఉన్న గ్రంథాలయముల పటములు జూపబడినవి. ఈ రెండు పద్ధతులును ఒక చోటనే ప్రదర్శించుటవలన వానికిగల తారతమ్యమే చూపరులకు సులభముగా బోధపడుచుండెను.

"క్యాలిఫోర్నియా" రాష్ట్రమున గ్రంథాలయములు చేయుచున్న పనిని, సినిమెటోగ్రాఫు యంత్రమునగూడ జూపిరి.

గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించిన పుస్తకములు పత్రికలకు మితమేలేదు. గ్రంథముల నేరుట, వర్గీకరణముజేయుట, బైండింగుచేయుట, మొదలగు విషయములను గూర్చి చూపరుల కనేకవిధములగు విషయములను జూపిరి. అమెరికా దేశమునందున్న కాంగ్రెసు మహాగ్రంథాలయము నూతన"న్యూయార్కు"- పౌర గ్రంథాలయము-లయొక్క భవనములు మొదలు చిన్న పల్లెటూరిగ్రంథాలయముయొక్క భవనమువరకును తారతమ్యములనుచూపుచు వివిధతరగతుల గ్రంథాలయ భవనముల "ప్లానులను" పటములను జూపిరి. నూతన గ్రంథాలయములను నిర్మింపదలచుకొనిన అనేకమంది జనుల కీపటములు మిక్కిలిసహాయభూతములైయుప్పినవి.

వివిధ ప్రదేశములయందున్న గ్రంథాలయ శాస్త్రమునుబోధించు పాఠశాలలయొక్క పనిని వేరొకచో జూపిరి. ఆయాపాఠశాలల పటములను, పట్టికలను, కొన్ని పరీక్షాపత్రములను, ప్రదర్శించిరి. న్యాయశాస్త్రము, వైద్యశాస్త్రము, మొదలగువానివలెనే గ్రంథాలయ శాస్త్రమునందుగూడ పండితులై జనులకుపకరించుటకు ప్రత్యేకముగ శిక్ష అత్యంతావసరమని ఈప్రదర్శన భాగము జూచుటవలన జనులకు బోధపడినది.

ఇంకొక స్థలమునందు అమెరికాదేశ గ్రంథాలయ సంఘమువారు గ్రంథాలయములకు సంబంధించిన విషయములనుగూర్చి ప్రకటించిన గ్రంథములనన్నిటిని ప్రదర్శించిరి. ఈ ప్రదర్శనమును జూచుటకై ౫౦,౦౦౦ జనులువిచ్చేసిరి. ఈప్రదర్శనమును జూచివచ్చి, అందలి సంగతులను తమతమ దేశములయందు వ్యాప్తముజేయుటకై, చైనా, స్పెయిను, స్వీడను, జపాను, ఇండియా దేశములనుండి, ప్రత్యేక ప్రతినిధుల నీప్రదర్శనమునకు పంపబడిరి. ఈ ప్రతినిధులందరును అనేకదినములు ప్రదర్శనమును జూచి, దానినిగురించి విపులముగ తమతమ భాషలయందు వ్రాసి, ఆయాదేశములయందెల్ల వ్యాప్తముజేసిరి. వారికి కావలసిన సంగతులన్నియు ప్రత్యేకముగ తెలుపబడినవి. ఈ విధముగ ఈ ప్రదర్శనము అమితముగ ఉపయోగకారియయ్యెను.

# నిజాము రాజ్యము—ఆంధ్రులు

ఘనతవహించిన నిజాం రాజ్యమునందు ౫౦ లక్షలాంధ్రులుగలరు. ఆంధ్రభాష వ్యవహరింపబడు జిల్లాలునేగలవు. ౧౯౦౧ సంవత్సర ప్రాంతమున దక్షిణ హైదరాబాదునందు, కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము, స్థాపింపబడినది. ఆంధ్రులసంపదలెని యేకఛత్రముక్రిందికి దెచ్చి ఆంధ్రసంస్కృత విద్యావ్యాపనముచేసి, కీర్తిగాంతుడైన ప్రతాపరుద్రదేవుని వలన, పాలింపబడిన ఓరుగల్లు పట్టణమునందు ౧౯౦౪ సం॥ ప్రాంతమున, శ్రీరాజరాజనరేంద్రాంధ్రభాషా నిలయము స్థాపింపబడినది. పూర్వము, కుతుబుషాహా కాలమున, సీతాపతిరాజుచే నేలబడి, యటుపిమ్మట వరాహపురాణ, సత్యవ్రతరాజాది గ్రంథముల రచించిన హరిభట్టుయను కవియొక్క నివాసమై, స్తంభాద్రియను నామాంతరముగల ఖమ్మంమెట్టునందు, శ్రీజ్ఞానసిద్ధ్యుత్ప్రవాహినీ యాంధ్రభాషానిలయము ౧౯౧౦ సం॥న స్థాపింపబడినది. పూర్వము భద్రాచల రామదాసను నామాంతరముగల గోపన్నగారి జన్మస్థానమువలన పావనమైన నేలకొండపల్లెయను పురమునందు, శ్రీ విద్యాప్రకాశాంధ్రభాషానిలయము, ఎఱ్ఱుపాలెము అను గ్రామమున శ్రీ మహబూబియా ఆంధ్రభాషానిలయము, వడ్డేపల్లియందు శ్రీ జగన్మోహన పుస్తకాలయము ఇవిగాక సికింద్రాబాదునందలి కొన్ని ప్రత్యేక భాషాసంఘములు, ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడుచున్నవి. కాని ఈ నిలయములకు సంబంధించినవారందరు అనగా కార్యనిర్వాహకులు సాధారణముగ బ్రిటిషు రాష్ట్రమునకు సంబంధముగలవారైనందునను కొంచెమించుమించుగ, రైలుమార్గములయందే ఇవి యుండుటవలనను, భాషాభిమానములు పర్చుకు వచ్చుచున్నవి. విశేషముగ ఆంధ్రులుగల ప్రదేశములు ఇనుపదారికి కడుదూరముగ నుండుట వలనను, తపాలసౌకర్యములు లేకుండుటవలనను ఈ సద్ధ్వని వారికి వినబడుటలేదు. ఆ భాగములలోనున్న ప్రజలకు గృహములయందు స్వచ్ఛమగు తెనుగు మార్దవముగ మాటలాడుటగుండ దెలియదు వారియందు మాధుర్యము మూర్తీభవించి పిశాచమువలె శివములూగుచున్నది. విద్యగూడ మిగులతక్కువ. ఇప్పుడిప్పుడు కొన్ని పాఠశాలలు అక్కడక్కడ స్థాపింపబడుచున్నవి. అయినను ఆంధ్రభాషాభివృద్ధికి ఎక్కువ అవకాశములేదు. ఈ రాష్ట్రీయమున భాషావిషయిక సమస్య విద్యాశాఖాధికారులవలన నింకను బరిష్కార మొందజాలకున్నది. ఇటీవల హైదరాబాదు నగరమందు అధికారమందున్న కొందరు విద్యాప్రియులు "హైదరాబాదు ఎడ్యుకేషనల్ కాన్ఫరన్సు" అని యొక సంఘమును నిర్మించియున్నారు. దీని సాంవత్సరికోత్సవ మీయేడు ఓరుగల్లు పురమున జరుగనున్నది. దీని యుద్దేశములు ఉర్దుభాషను వృద్ధిచేయుటకైయున్నది. ఇందుకు కారణముగలదు. ఈ దేశమున నుర్దుభాషకు రెండువిధములుగ ప్రాముఖ్యతగలదని విద్యాశాఖాధికారులవలన నిరూపింపబడినది. (1) ఉర్దు ఒకటిగనుక దేశీయభాషలలో నొకటియగుట, (2) ఉర్దు ఈ దేశమందలి రాజకీయావసరములు నెగ్గుటకాధారభూతమై యుండుట. ఈ స్థితిగతులలో నుర్దుభాష నిజాంరాజ్యమునందలి యాంధ్రసోదరులకు స్వభాష కాకపోయినను, పై కారణములనుబట్టి స్వభాషకంటె నుర్దుభాషనే యక్కుడు శ్రమచేసి సాధించవలసి యవసరమగుచున్నది. స్వభాషావృద్ధికి యీ స్థితిగతులలో యేమాత్ర మా రాజ్యమున నాంధ్రులకు తృప్తికరమైన యవకాశములేదు. లేకని యూరకున్న పక్షమున ఆ దేశపుటాంధ్ర సోదరుల చరిత్రము మున్ముందు చిత్రముగా నుండగలదు. వర్తమానావస్థయందు బొంబాయి, కాశీ, రంగూన్, బంగాళము, మున్నగు దేశములకు వలసపోయిన ఆంధ్రకుటుంబములు చారిత్రకవిజ్ఞానమువలన తమ సాంప్రదాయములను స్మృతికిదెచ్చుకొని తమ తమ ప్రదేశములందు స్వభాషా ప్రచారక సంఘములను, సమాజముల నేర్పరుచుచుండగా, మా దేశీయులు స్వభాషాభివృద్ధిమీఁద బ్రయత్నించనిపక్షమున బుద్ధిపూర్వకముగ దమ సాంప్రదాయములను తమ ప్రత్యేక లక్షణములను బోగొట్టుకొనువారగుదురు. ఏది యెట్లున్నను మాసమస్య

చిత్రముగా నేయున్నది. ౫౦ లక్షల ఆంధ్రులకు పట్టుమని పది బహిరంగ భాషా సంఘములు లేనపుడు పూర్వోక్త నిలయ సంఖ్య సముద్రములో కాకిరెట్ట యనవలెనుగద. ఈ స్థాపింపబడిన సంఘములలో నొకటి రెండుదక్క తక్కినవన్నియు దినగండము, నూరేండ్లాయుష్యము వలెనున్నవి. దీనికి కారణము ద్రవ్యోపపత్తిలోపమని పలుమారులు వినబడుచున్నది. అట్లయినను పనిచేయువారేరి? పెక్కుగ్రంథాలయములు అవిచారముగ స్థాపింపబడి యవిచారముగనే కూలిపోవుచున్నవి. ఏయుద్యమమందైనను జయముసిద్ధింపవలెనన్న మనమెవరు కార్యములయందు పట్టుదలయుండవలెను. కార్యముయొక్క విలువను ప్రజలకు ప్రకటించుటకు దగినయోగ్యత సంపాదింపబడవలెను. ద్రవ్యాదిపరికరములు తమంతట తామే వచ్చును.

— హరి బాపయ్య.

# గ్రామచరిత్ర : రొయ్యూరు

రొయ్యూరు జోగిరాజుకవి.

భరతఖండమునకు గంజుకాగితములును లోహప్రముద్రణాయంత్రములును రాకపూర్వము, మహనీయులచే పెక్కుగ్రంథములు తాటియాకుపత్రములపై ఇనుపగంటములచే లిఖింపంబడి దేశమెల్లెడ వ్యాపింపబడక, కాలముగడచినకొలది, యెచ్చటివచ్చటనే నశించి, దేశభాషాభివృద్ధికిని జ్ఞానాభివృద్ధికిని మిక్కిలి యాటంకము నాపాదించినవి. అప్పటి ఉత్కృష్టగ్రంథములు మాత్ర పెట్టెలలో కొన్ని నిలచియున్నవి. ఇటీవల మూలమూలల నడగియున్న తాటియాకు గ్రంథములు సాధ్యమయినంతవరకు సమకూర్పబడుచున్నవి. అందు మత సంబంధమైనట్టియు, భక్తి సంబంధమైనట్టియు, శాస్త్రసంబంధమైనట్టియు, గ్రంథము లెన్నో బయల్పడుచున్నవి.

కృష్ణామండలమునందున్న రొయ్యూరుగ్రామమున సుమారొకశతాబ్దమునకుపూర్వము రొయ్యూరు జోగిరాజు, గోపరాజుగార్లను సోదరు లిరువు రుండిరి. వీరు ఆరువేల నియోగిబ్రాహ్మణులు, భారద్వాజసగోత్రోద్భవులు, వీరితండ్రి అచ్యుత రామయ్య. తాత రామరాజు వీరిగ్రామమునకు ఆదిమవాసులు.

ఇందు జోగిరాజు భగవద్భక్తుండు, నిష్ఠాగరిష్ఠుండు, కవివరేణ్యుండు. ఆమహానుభావుడు కాళ్ళకు గజ్జెలుగట్టి చిందులుద్రొక్కుచు, ఒకచేత తంబురమీటుచు, వేరొకచేత తాళమువేయుచు, పరవశుండై, నృత్యగీతములు సల్పునప్పుడు రెండవ రామదాసో, కబీరో, త్యాగరాజో యనువారును కాదు నారదుడో, తుంబురుడో అవతరించెననువారును గలరని యిప్పటికిని చెప్పుకొనుచుందురు. భక్తుడు కవియగును, కవిభక్తుడగునని చెప్పుటకు ఈతనయే ఉదాహరణము.

ఈభగవద్భక్తుండు తానురచించిన కీర్తనలనే పాడుచు తన్మయావస్థలో మునిగి తేలుచుండెడివాడు. భక్తి అపారమై బీదవాడనని శంకింపకయును తాను అశక్తుడనని పరిగణింపకయును, దేవాలయముల నిర్మింపవలెనని సంకల్పించెను. భక్తికుదురవలెగాని ఎంతమహాత్కార్యమైనను ప్రయత్నమంత్రమున సిద్ధింపకుండదుగదా! దేశభక్తులును, రాజభక్తులును భగవద్భక్తులును ఏకశక్తియుక్తులను, సర్వస్వమును, తాము తలపెట్టిన కార్యములకై వినియోగించుటయే గాక మూడుముక్కలౌ తమతమ ప్రాణములనైనను సరకుగొనక, అవసరమైన నర్పించుటకు సంసిద్ధులయ్యెదరు. దానికంతటికిని నిష్కళంకమయిన భక్తియె ప్రధానము. చిత్తశుద్ధితో తల పెట్టిన ప్రతికార్యమును నెరవేరకపోదు. జోగిరాజుగారికితిని దృఢసంకల్పచిత్తుండగుటతోడనే తన సోదరుండగు గోపరాజుగారు కూడ అందులకై పూనుకొనినవాడాయెను. వీరును భక్తియందేమి శిష్టాచార సంపత్తియందేమి

తమయన్నగారి కావంతయు నీసిపోరు. ప్రతి నిత్యమును జపమును దేవతార్చనను, సక్రమముగా చేయుచు, సీతా కళ్యాణాది ఉత్సవములును, రామాయణపారాయణము ను సంతర్పణలును చేయుచుండెడివారు. వీరిచే దేవతా ర్చనజేయబడిన దేవునిశిరము మాయింటియందు ఇప్పటి కిని గలదు.

రాయ్యూర్యరు వల్లూరు జమీలో చేరియున్నందున గోపరాజుగారు ఈ సంస్థానములో లౌకికవ్యవహార పరుండై ఉద్యోగమును చేయుచు వ్యవహారములను సైతము చూచుకొనుచు తన అన్నగారి ఉద్దేశ సాఫల్యమున కేకీభవించెను. పలుకుబడిగలవారగుటచే, తమస్వశక్తివలనను ధార్మికుల సహాయ సంపదలవలనను చాలినధనము నిరంతరశ్రమచే నిరువురును గడించి శ్రీ వేణుగోపాలస్వామివారికిని శ్రీ పార్వతీసమేత శ్రీ సక లేశ్వరస్వామివారికిని చక్కని ఆలయములు నిర్మించిరి. అందు తామిరువురును విగ్రహముల ప్రతిష్ఠించి తాము పూనిన కార్యము నిర్విఘ్నముగా ఈశ్వరసంకల్పము చే నెరవేర్చుకొనగలవారైరి. ఈ ఆలయములకిప్పటి కి శాస్త్రమును ననుసరించి యాబదివేల రూప్యము లైనను చాలవని తోచును. వీరిచే నిర్మితములయిన శేష తల్ప విమానముగల విష్ణ్వాలయమును తదితర శివాలయము లును దృఢతరములై పూర్వపు శిల్పకళానిపుణత్వమును వెల్లడించుచున్నవి. ఈ ఆలయముల స్థిరత్వమునకు తమ స్వంత ఈనాములనుండి రెండుకత్తుల భూవసతికూడ నొసగిరి. ఈ సుందర విమానములపై చూడ్కినిడువా రెల్లరికిని వారిప్రతిష్ఠ స్ఫురణకురాని దినమేలేదు.

వీరు జీవాత్మకును పరమాత్మకును విభేదములేదని నిరూపించు శంకరుని మతమగు అద్వైతమతస్థులు. జాతి మతభేదములు లేక యెల్లరు భక్తియుక్తులగుటచే మోక్షము సంప్రాప్తమగుననియు భక్తియే ప్రధాన మనియు బోధించు రామానుజాచారి మతమగు విశిష్టా ద్వైతమతావలంబకులగు వైష్ణవోత్తములు, ఆ మతప్రచా రమునకై అద్వైతులకుగూడ ఊర్ధ్వపుండ్రములను బెట్టించి చక్రాంకితములజేసి వైష్ణవధర్మముల నుపదేశిం చుచు వీలువెంట నయభయముల తమకు శిష్యులనుగా జేసికొనుచుండిరి. వీరికి గురువులు వైష్ణవులు. జోగిరాజు గారికి గురుభక్తిమెండు. గురువుపై కృతి నిచ్చియు, ప్రశంసించియు కొన్నోగ్రంథములను వ్రాసిరి. గురువులపై తమకుగల భక్తిని వెల్లడించిరనుటకు వీరు వ్రాసిన యీ క్రింది, వేణుగోపాలశతకములోని మూడవపద్యము నిదర్శ నముగా గనపట్టుచున్నది.

సీ. శ్రీరామ తారకసేవాభిరతుండనై
ముందు విష్వక్సేనమూర్తి దలచి
పరమత్రైలోక్య దీపాంకుర జననియై
త్రివిధంబు మెలగు యిందిరకు మ్రొక్కి
రామానుజాచార్య రాజితాళ్వారాది
పరమవైష్ణవులకు బ్రణుతిజేసి
తిరుమల పురివాల్లదేశకాన్వయకంధి
సోముండౌ రఘునాథసూరి సూను

గీ. రాఘవాచార్యకృపను విరాజితముగ
సన్నుతించెద నిను సుప్రసన్నవరద
భూరిగుణజాల రాయ్యూర్యరి పురవిలోల
వేణుగోపాల శ్రీలోల విజయశీల.

ఇంతియగాక ౧౦ యకరముల ఈనాంభూముల నయితము నొసగి తమగురుభక్తిని వెల్లడించిరి. గురువు లుగానుండి శిష్యులకు వైష్ణవధర్మములు ఉపదేసించుచు న్నంత కాలము అందుల ఫలసాయముల ననుభవించుచుం డవలసినదేగాని విక్రయాది హక్కులులేకుండా యిచ్చి యుండినపక్షమున వారి వారసు లిటీవల అట్టియీనాం భూమిని ఇతరులకు విక్రయించుట సంభవింపకుండెడిది.

జోగిరాజుకవిచే తాటియాకుపొత్తములపై వ్రాయ బడిన పారుజాతాపహరణము మొదలగు గ్రంథములు కొన్ని తమపై కృతి నివ్వబడియుండినకతమున వానినన్ని టిని అచ్చువేయించి ప్రకటించెదమని వచించి మా వైష్ణ వ గురువులుగొంపోయి యిప్పటికైనను వానిని ప్రచురించి యుండలేదు.

మిగిలిన గ్రంథములలో వంశక్రమాను గతముగ పునర్లి ఖితములై కొంపల్లి కాగితములపై వ్రాయబడిన గోపాల శతకము, హనుమంతశతకము, వేణుగోపాల శతకము, వామన విజయము, కీర్తనలు, పాటలు మున్నగునవి కొన్నిమాత్రమిప్పటికి మాకుచిక్కినవి. వానిని క్రమ ముగా లిఖితలోపముల సవరించి ప్రకటించి లోకమునకం దజేసెదము.

-రాయ్యూర్యరి రామచంద్రప్రసాదరావు.

# శ్రీ రామమోహన ధర్మపుస్తక భాండాగారము - బెజవాడ.

## ౧౯౧౬ సం. ర వృత్తాంతము.

కొందఱు యువకులుకూడి స్వల్పచందాలు వేసికొని ౧౯౧౧ సంవత్సరమున స్థాపించిన ఈగ్రంథాలయము దినదినాభివృద్ధినొంది ఉన్నతస్థితికి రాగలుగుటెంతయు సంతోషకరము. ప్రారంభమునందు కార్యనిర్వాహకులు శేషముగ అంతరాయములకు లోనయినప్పటికిని, పుర ప్రముఖులయొక్కయు, ధనవంతులయొక్కయు- అందు ముఖ్యముగ నడిమితిరువూరు జమీందారులగు కీర్తిశేషులైన శ్రీరాజా వెల్లంకి చినవేంకట్రామారావు బహద్దరు జమీందారుగారియొక్కయు ప్రోత్సాహమువలన, ఈ భాండాగారము నిట్టి యభ్యుదయస్థితికి దేగలిగిరి. ప్రారంభదశయందు కార్యనిర్వాహకులు పడిన కష్టనిష్ఠురములయొక్క పరిమితినిగూర్చి వ్రాయుటకన్న ఊహించుకొనుటయే సులభము.

౧౯౧౬ సంవత్సరము ౧౩ వ జనవరి ఉదయమున నూతనభవనప్రవేశ మహోత్సవమును నైజాము శాసన నిర్మాణసభ్యులగు శ్రీయుత పంగళి వెంకట్రామారెడ్డి దేశముఖ్ గారి యాధిపత్యముక్రింద జరిపితిమి. ఆనాటి మధ్యాహ్నమున రావుబహద్దరు రఘుపతి వేంకటరత్నం నాయుడుగారి యాధిపత్యముక్రింద ఐదవ వార్షికోత్సవము జరిగినది. "ఆంధ్రవాఙ్మయము—దాని ప్రస్తుతస్థితి"ని గూర్చి రాయప్రోలు సుబ్బారావుగారును, "దేశభావల"ను గూర్చి వల్లూరి సూర్యనారాయణరావుగారును, "ఆంధ్రోద్యమము"ను గూర్చి కొండపల్లి శ్రీరామచంద్రరావుగారును ఉపన్యసించిరి. ప్రాచీనకాలమునందు దేవాలయములను మఠములను ఎట్టిభక్తితో మనపూర్వులు ప్రతిష్ఠించిరో అట్టి యుత్సాహముతోడను పట్టుదలతోడను నేడు మనము ధర్మగ్రంథాలయములను ధర్మవైద్యాలయములను నిర్మింపవలయుననియు, ఆంధ్రదేశ మధ్యభాగమునందున్న ఈ బెజవాడ పదిసంవత్సరముల క్రింద టివరకును నిద్రావస్థయందుండి నేడు ఇట్టి గ్రంథాలయమును ప్రతిష్ఠింపగల యుత్సాహవంతుల నాకర్షించుట చూడ దేశాభివృద్ధికి శుభసూచకముగ నున్నదనియు, ఈ గ్రంథాలయ నిర్వాహకులు చేయుచున్నపని దేశమునందున్న ఇతరులకు మార్గదర్శకముగ నుండనోపునని యు జెప్పి, ఇట్టి యుత్సాహముతోడనే ముందుగూడ పనిజేయుదురుగాక యని యాశీర్వదించుచు శ్రీ వేంకటరత్నం నాయుడుగారు సభను ముగింపునకు దెచ్చిరి. ఆనాడు మధ్యాహ్నము విజయవాడ అన్నదాన సమాజమువారు మా యావరణయందు ౫౦౦ మంది బీదలకు అన్నదానమొనర్చిరి. మరునాటి ఉదయమున "శ్రీ గోపాలకృష్ణగోఖలే" మహాశయుని ఛాయాపటమును రావుబహద్దరు వేంకటరత్నంనాయుడుగారు ప్రతిష్ఠించిరి. గోఖలే జీవితమునుగూర్చి శ్రీ పేరి నారాయణమూర్తిగారును దాసు త్రివిక్రమరావుగారును ఉపన్యసించిరి. ఈ పటమును శ్రీయుత కోట కృష్ణస్వామినాయుడుగారు స్వయముగా తయారుచేసి మాకొసంగిరి. ఆనాడు మధ్యాహ్నమున అయ్యంకి వేంకటరమణయ్యగారిచే నియ్యబడిన మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి ఛాయాపటమును శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రతిష్ఠించిరి.

హిందూవిశ్వవిద్యాలయస్థాపకులును, స్వార్థత్యాగమునకు మార్గదర్శకులును అగు శ్రీ దర్భాంగామహారాజులుంగారు ౧౯౧౬ సం. జనవరి ౧౫ తేదీ ఉదయమున మాయాహ్వానము నంగీకరించి ఈ గ్రంథాలయమునకు విచ్చేసి, ఈ సంఘమును గౌరవించిరి. మఱియు జూలై నెల ౧౮ వ తేదీ ఉదయమున, శాసననిర్మాణసభ్యులగు ఆనరబిల్ సర్ పి. యస్. శివస్వామి అయ్యరు గారు మాగ్రంథాలయమునకు విచ్చేసిరి. నవీనకాలమున గ్రం

థాలయములు పుస్తక దుకాణములుగా మాత్రముండక శాలశాఖ మొదలగువాటిని ప్రారంభించి జనులకు లెక్కలేనన్ని విధముల తోడ్పడవలసియున్నదనియు, ఇంక గ్రంథముల నపరిమితముగా కొనవలసియున్నదనియు, ఈ పనులన్నియు నిర్వహించుటకుగాను చందాలవలన వసూలగుద్రవ్య మెంతమాత్రమును చాలదనియు, కావున లోకల్ బోర్డులనుండి గ్రాంటుల నిప్పింపవలసినదనియు_ ఆంధ్రదేశమున ౭౫౦ గ్రంథాలయములు గలవనియు, ఇవి స్థిరముగ నుండుటకుగాను ౧౮౬౦ సంవత్సరము యొక్క ౨౧ నెం. ఆక్టుప్రకారము రిజిష్టరీ చేయించుకొనుట అగత్యమై యున్నదనియు, ఆయాక్టునుబట్టి రిజిష్టరు చేయించుటకు రు ౫౦ ల ఫీజును చెల్లింపవలసి యున్నదనియు, గ్రంథాలయము లిట్టి మొత్తమును భరించు స్థితిలో లేవనియు, కావున వీనినిగూడ "సహకారి పరపతిసంఘము"ల వలెనే ఉచితముగా రిజిష్టరీచేయునటుల ఏర్పాటుచేయింపవలసినదనియు విజ్ఞాపనపత్రికను శ్రీ శివస్వామి అయ్యరుగారికి సమర్పించితిమి. దానికి శ్రీవారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. "నేను అనేక పాఠశాలాభవనములకును నీటిగొట్టముల మరలకును శంఖుస్థాపనను జేసియుంటిని. అవియన్నియు పూర్తికానప్పటికిని, మూడు సంవత్సరములక్రిందటనే నేను శంఖుస్థాపనజేసిన ఈ గ్రంథాలయముయొక్క స్వంతభవనమును స్వయముగ చూచుటకు నాకెంతయో యానందమగుచున్నది. ఈ కాలమున గ్రంథాలయోద్యమము దేశాభివృద్ధికి ముఖ్యసాధనములలో నొకటిగ ప్రసిద్ధిగాంచుచున్నది. నిమ్నజాతులకొరకేర్పరుపబడిన పాఠశాలయు, స్త్రీలు చదువుకొనుటకై వారిండ్లకు గ్రంథముల నుచితముగ పంపుటకు చేసిన ఏర్పాటును మీసంఘమును విశేషముగ జనోపయోగకరమగునటుల చేయుచున్నవి. మునిసిపాలిటీలయొక్కయు, లోకలుబోర్డులయొక్కయు ద్రవ్యములనుండి గ్రంథాలయములకు సహాయముచేయుట నాయభిష్టమై యున్నది. గ్రంథాలయములు దొరతనమువారియొక్క ౧౮౬౦ సంవత్సరము ౨౧ నెం. చట్టము ననుసరించి రిజిష్టరు చేయించుకొనుటకు ప్రస్తుతస్థితినిబట్టి, యివ్వవలసిన రు ౫౦ ల రుసుమును గద్దుపరిపించనని మీరుచేసిన రెండవప్రార్థనయు నాకంగీకారమే. ఆయంశమును సరియైన మార్గమున నాయొద్దకు పంపినయెడల ఆందునుగూర్చి తగినట్లు ఆలోచనలోనికి దెచ్చెదను."

ఈ గ్రంథాలయమునకు ప్రత్యేకము గ్రంథములను కొనుటకై కొంతమంది రు ౮౦౦ లకు పైగనే విరాళముల నొసంగియుండిరి. కాని ఈద్రవ్యములో చాలభాగమును భవననిర్మాణము కొరకే వినియోగించియుంటిమి. ఈసంవత్సరము మాత్రము రు ౭౯౯-౮-౯ ల గ్రంథములను కొనగలిగితిమని దెలుపుటకెంతయు సంతసించుచున్నారము. ముందుసంవత్సరము ఎక్కువ గ్రంథములను కొనుటకై ప్రయత్నింతుము. పుస్తకములు కొనుటకంటె వానికి అట్టలు కట్టించుటకై ఎక్కువ సొమ్మును వ్యయపరుపవలసి వచ్చుచున్నది.

మాచే నిర్వహింపబడుచున్న పంచముల పాఠశాల యథాప్రకారముగనే నడుపబడుచున్నది. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు, యల్లంరాజు శాస్త్రులుగారు వారి వాగ్దానములప్రకారము చందాలనిచ్చి పోషించుచున్నారు. ప్రభుత్వమువారును, దీపావళి సంఘమువారును విరాళముల నిచ్చి ప్రోత్సాహపరచుచున్నారు. పంచమబాలురకు కేవలము చదువుట వ్రాయుట నేర్పినంతమాత్రము చాలదు. పిల్లకాయలకు పొట్టకుతిండి, కట్టుటకు గుడ్డలనుగూడ ఇచ్చి, జీవనమునందు వారికి సహాయపడు పరిశ్రమలను నేర్పుట అత్యవసరమని మా అనుభవమునుబట్టి తెలియుచున్నది. ఆ గుడిసెలలో దరిద్రమువలన పీడింపబడుచుండి అన్నములేక మలమల మాడిపోవుచుండగ వానిని శుభ్రముగ నుండుమని మనము చేసినబోధ వానిమనసునకెక్కునా!

ఈ సంవత్సరము మాసంఘమునకు గుండా సుబ్బారాయుడుగారు "బైసికిల్" ఇచ్చుటచే మా పనులు త్వరలో చేసికొనుటకు చాల వీలుకలుగుచున్నది.

కృష్ణానది వరదల వలనను, కొల్లేటి ముంపు వలనను మనసోదరులు బాధపడుచున్నారని వినినవెంటనే మే

ము విచారపడి, మాశక్తికొలది వారలకు సహాయము చేయ పూనుకొంటిమి. మాప్రయత్నమునకు మాపట్టణవాసులును, దేశీయులును దానకర్ణులగు శ్రీపిఠాపురము రాజాగారును పూర్ణమగు సహాయము నిచ్చుటచే పలుతావులకు బోయి సేవజేసితిమి. ఒక ప్రదేశమును పేర్కొననేల! ఎచట సేవజేయవలసివచ్చినను, వెనుకంజవేయక మావిధిని మేము నెరవేర్చుకొంటిమి. "గ్రంథాలయములకును, వరద బాధితుల సేవకును సంబంధమేమి" యని కొందరు ప్రశ్నించుచున్నారు. ఈకాలము నాటి గ్రంథాలయములు పుస్తకసు కాణములు మాత్రమేనైయుండక సాంఘికసేవాసదనములై యున్నవని తిరిగి ఋజువుజేయుచున్నారము.

ఈవత్సరమున భవననిర్మాణమును గూర్చి చెప్పదగినంతపని జరుగలేదని దెలుపుటకెంతయు చింతిల్లుచున్నారము. పైఅంతస్థును కట్టించుటకై శ్రీ కాశీ సూర్యనారాయణరావు పంతులుగారు సిద్ధముగనున్నారు. ఇదివరకే వారు రు ౧౦౦౦ లను వ్యయపరచి తలుపులను దర్వాజాలను తయారుచేయించి మాకిచ్చియున్నారు. కాని చుట్టు వసారా పూర్తికాకుండుటచే వారి వాగ్దానము ఇంతవరకును నెరవేరుటకు వీలుగాదయ్యెను. ఈ వత్సరమున ఈ వసారాను పూర్తిజేయుటయే గాక, పైయంతస్థును గూడ పూర్తిచేయగలుగుదుమని తలంచెదము.

ఈవత్సరము రు ౧౭౧౩-౧౬ విరాళములవలనను, రు ౪౯౭ లు నెలసరి చందాలవలనను, సంపాదింపగలిగితిమి: మునిసిపాలిటీవారు రు ౬౦ లను ఇచ్చిరి పంచముల పాఠశాలకు రు ౭౨ ల గ్రాంటును ప్రభుత్వమువారిచ్చిరి. మొత్తము ఈ వత్సరము ఆదాయము రు ౨౯౨౬-౧౪-౯. ఇందు వార్తాపత్రికలు, గ్రంథములు, నౌకరులు, పంచముల పాఠశాల, అప్పుతీర్చుట, భవన నిర్మాణము మొదలగు వానిక్రింద రు ౨౩౭౭-౧౧-౨ ఖర్చు అయినది. గాక నిలువ రు ౧౯౨-౩-౩.

మన దేశమునందు ఏయుద్యమమునెడలనైన ప్రారంభమునం దుత్సాహము మెండు. కాలముగడచినకొలదిని ఆయుత్సాహమడుగంటి, ఆయుద్యమము నామమాత్రావశిష్టమగుచుండును. ఇందుచే అనేకప్రతిష్ఠాపనలు స్థాపింపబడుటయు కొంతకాలమత్యుత్సాహముతో వెలుంగుటయు, పిమ్మట నిద్రించుటయు మనమెల్లర మెఱింగినదేను.

కాని గ్రంథాలయోద్యమము ఒకరి ఉత్సాహముతో మాత్రము తేజరిల్లునది కాదు. నిరుత్సాహముతో క్రుంగునదియు గాదు. దేశమునందు అగత్యతనుబట్టి ఈయుద్యమము సకాలమునందు నలుదిక్కులను తలయెత్తి వ్యాపించినది. ఈ యుద్యమముయొక్క యావశ్యకతను సర్వజనులును గ్రహించి అభిమానించుచున్నారు.

ఆంధ్రదేశము నంతకును మధ్యభాగమున నుండు భాగ్యము ఈ పట్టణమున కబ్బినది. ఔదార్యవంతులగు జమీందారులును, ధనవంతులును మాకు చేయూతనొసంగ కీర్తికాములగుచున్నారు. ఇట్టిస్థితియందు దీనిని ఆంధ్రదేశమునకంతకును ఆదర్శప్రాయముగనుండునటుల చేయవలెననిమాయాశయము. ధర్మగ్రంథాలయముయొక్క ఆదర్శముల నన్నిటిని కార్యరూపమున నెట్టుటకు ఇంతటి నుండియు ప్రారంభించెదము. ధర్మగ్రంథాలయోద్యమమును గూర్చిన విశేషాంశములను నేర్చుకొనుటకును అక్కడ జరిగిన గ్రంథాలయప్రదర్శనశాఖను జూచుటకును మా గ్రంథాలయ కార్యదర్శి ఆంధ్రదేశ గ్రంథభాండాగారసంఘుపక్షమున బరోడారాష్ట్రమున కేగియున్నారు. అందులకు ఫలితముగ నేటియుదయమున మాగ్రంథాలయమునందు "బాలశాఖ"ను ఏర్పాటుజేసియున్నాము. ఇంకను పుస్తకములపట్టికలకు సంబంధించిన విశేషాంశముల నాచరణయందుబెట్టుటకై ఈవత్సరము పాటుపడెదము.

మా భాండాగారమునకు తీర్చవలసిన అప్పు రు ౪౦౦౦ ల వరకును గలదు. భవనముచుట్టును వసారాను ప్రహరీగోడను పూర్తిజేయుటకై రు ౩౦౦౦ లు కావలయును. ఆంధ్రగ్రంథములను సేకరించుటకు రు ౯౦౦౦ లును, సంస్కృత గ్రంథములను సంపాదించుటకు

రు ౮౦౦౦ లును, ముఖ్యములగు ఆంగ్లేయ గ్రంథములను సంపాదించుటకు రు ౧౨౦౦౦ లును, భాండాగారము శాశ్వతముగాజరుగుటకు గాను మూలధనము రు ౧౦,౦౦౦ లును మొత్తము రు ౪౦,౦౦౦ లైన కావలసియుండును ధర్మ గ్రంథాలయములను మిక్కిలి ప్రయోజనదాయకములుగఁ జేయుటకు ఎన్నియోసాధనములు కలవు. కాని ఏసాధనములనువినియోగించినను జనసామాన్యము నాకర్షించుట ప్రధానకర్తవ్యము. ఇందులకు మ్యాజిక్‌లాంతరువంటి మోహనయంత్ర మింకొకటి కానరాదు. దీనితో మహాత్ములను చిత్రవిచిత్రోపయోగములు కలిగించవచ్చునని బొంబాయి సేవాసదనమే సాక్షి. సమగ్రమగు నొక మ్యాజిక్‌లాంతరును సంతరించుటకు ౧౦౦౦ రూపాయలు పట్టును. కావున ఆంధ్రమహాజనులెల్ల సాయపడి మాయాశయములెల్ల ఆచరణయందు పెట్టుటకు తోడ్పడెదరుగాక యని భగవంతుని సదా ప్రార్థించుచున్నారము.

ఊ. వేంకటరంగనాయకులు,
కార్యదర్శి.

నలనామ సం॥ర మాఘ బ ౧౧ లు.

## కావ్యము

శా. వేదంబుల్ నృపశాసనంబులు సుహృద్విజ్ఞాపనంబుల్ పురా
ణాది గ్రంథము లంగనాజనవిలాసాలాపలీలాసమ
ప్రాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
వాద ప్రక్రియ లెన్నఁ గావ్యమహిమల్ వర్ణింపఁగా శక్యమే. నరసభూ 1. 25.

మ. పరమజ్ఞానలతాలవాలము, జగత్ప్రఖ్యాతవిఖ్యాత సా
గర చంద్రోదయ, మిష్టసంఘటన రేఖాదివ్యధేనూత్త, మం
బురు కారుణ్యదశానిశాదినముఖం, బుద్వేల నిర్వాణ భ
వ్యరసాస్వాదరసాయనం బనినఁ గావ్యం బెన్న సామాన్యమే. నరసభూ 1. 26

## ఆంధ్రమాత

శా. శ్రీలింపొందగ యావదాంధ్రజనమా ♦ తృత్స్నాతలీనాత్మ తే
జోలీలామృతమాని, దద్బలవదా ♦ త్మైక్యంబునన్ తావకో
ద్వేల ప్రాక్తన కీర్తిగీతికల న ♦ ర్థింబాడు నీపుత్ర పు
త్రిలోకంబుల కేమిదెల్పెదవు సం ♦ దేశంబు నాంధ్రావనీ!

శా. ఆశల్ కౌతుకపూర్ణచంద్రికలు పూ ♦ యన్, దుర్దినాచ్ఛాద మా
కాశంబున్ విడిపోవ, నూతనకళో ♦ త్కర్షాప్తిమై మాతృపూ
జాశోభల్ దయివాటు నీశుభదినో ♦ త్సాహంబునీక్షించి, నీ
యాశీర్వాదములిమ్ము పుత్రులకు నం ♦ బా! యాంధ్రదేవీమణీ!

శా. తేటల్ దేరెడు కాంతిపూరముల నుద్దీపించు ముత్యాలము
ప్పేటల్ వ్రాలె ద్వదీయకంఠమున శోభింపుల్ నిగారించు, చే
నాటన్ జీవనశోషణల్ గనని కృష్ణాగౌతమీ భద్రలన్
గాటంపుందమిఁ ద్రావువార మిదె కాంతా క్షీర మాంధ్రావనీ!

శా. ఆ చాళుక్యనృపాలరత్నముల వియ్యంబంది, శ్రీకాకతి
క్ష్మాచక్రేశుల లాలనన్ వడసి, కృష్ణప్రాజ్యసామ్రాజ్య పీ
ఠీచంచజ్జయ కన్యతో సరసగోష్ఠిన్ ప్రొద్దువోఁబుచ్చు, నీ
ప్రాచీనాభ్యుదయంబు నెన్నెదరు గర్వస్ఫూర్తి తల్లీ! సుతుల్.

శా. ఉద్యన్మోహనమై, కుమారజన గర్వోద్రేకమై, యాత్రిలిం
గోద్యానాస్తమధూదయంబగు నవీనోత్సాహపున్ వేళ, నా
విద్యారణ్యయుగంధరాదుల యశోవీర్యంబు లగ్గించు, నీ
విద్యాస్నాతకులాసఁ జేసెదరు, దేవీ! సంప్రసాదింపవే.

ఉ. జారిన దేశగౌరవముఁ జక్కనదిద్ది, మహాంధ్రమండలీ
భారము శ్లాఘనీయముగఁ బాలనఁజేసి, సమానరాష్ట్రముల్
కూరిమి నాసఁజేయ, తెలుగుంబుడమిన్ గయిసేయరయ్య, దీ
క్షారతి నాంధ్రపుత్రులు! జగజ్జనధర్మమె దృష్టినిల్పుచున్.

శా. ఉల్లాసంబున మాతృసేవ పయిపై నుఱ్ఱూతలూగంగ నా
పల్లీ పట్టణ దిగ్దిగంతర తలీపర్యంత వేంగీభువిన్
జల్లుండాంధ్రమహోద్యమ ప్రథమపూజాపుష్పముల్ ప్రేమపుం
ద్రాళ్ళంగట్టుఁడు యాసదాంధ్రజనసంతానంబు నాపైహితుల్!

సీ. రణరక్తబంధురారుణమైన ఖడ్గతిక్కన కత్తి కడిగిన కదనభూమి 1
అమృతాంశుగపి కాసమమున యా సుకవి పోతనలేఖిని ప్రశాంతిఁగనినచోటు 2
భాషాకుమారి కబ్రపుఁబెండ్లియిల్లైన కృష్ణరాజ్యము వెలింగినతలంబు 3
నానావిదేశనౌకాసీక విపులాశ్రయంబైన రేవు మూపటినతావు 4
గీ. పాడయి శిలావశిష్టమై ప్రాప్త కాల। మనుభవించుచు, నుండియు నక్కటకట!
బ్రదికిచెడ్డయాంధ్రుల పూర్వవైభవంబు। చాటెడిని నాలకింపుడు శాంతమతులు!

మ. కల దాంధ్రోద్యమవల్లికాకుసుమ రేఖామాలికాకాంతి తుం
దిలశోభాంకురపుంజముల్ భరతమాతృస్ఫీతచూడామణీ

---

1. పాలేటియొడ్డు. 2. ఒంటిమిట్ట. 3. విద్యానగరము. 4. బాపట్లసమీపపు మోటుపల్లి.

కలితచ్ఛాయల నందగింపఁగల, భాగ్యంబింక, నీసాంగ
మంగళకళ్యాణముఁబాడఁ బుత్రికలె వేడ్కన్ వత్తురానాఁటికిన్.

శా. సంతోషింపగదమ్మ! యాంధ్రజననీ! సారస్వతస్నాన
విశ్రాంతిప్రీతుల, నీదుపుత్రికుల, దీక్షాబద్ధులంజూచి
నిశ్చింతన్ సోదరులార! భూజననిఁబూజింపుండు బ్రహ్మర్షణో
దంతవ్యక్తి మనోబలంబున, దథాస్తంచున్ ఋషుల్ పల్కఁగన్.

—రాయప్రోలు సుబ్బారావు.

# మహాభారతయుద్ధమునకు శ్రీకృష్ణుడెంతవరకు కారణము?

ఈవ్యాసము ఆంధ్రమహాభారతమునందలి యుద్యోగపర్వము ననుసరించిమాత్రమే వ్రాయబడుటచే ఇందలి యభిప్రాయములు మహాకవి తిక్కనవియని మనము గ్రహింపవచ్చును.

పాండవులు అభిమన్యుని వివాహానంతరము విరటుని కొల్వులో బంధుమిత్రులగు రాజులతోగూడి యన్యచింతల మరిచి సరససల్లాపములతో వినోదించుచుండిరి. అత్తరిని "పాండవకార్యార్థియై" కృష్ణుడు అచ్చట చేరిన రాజబృందమునకు కౌరవులదురాగతములను, పాండవులు పదమూడేండ్లుపడిన పాట్లను ధర్మరాజుయొక్క ధర్మబుద్ధిని జ్ఞాపకమునకుదెచ్చి, పాండవులయెడ సానుభూతియు కౌరవులయెడ ఈర్ష్యాక్రోధములను గలిగించి, యావల వారితోనిట్లనెను:— "పాండవులకు పితృధనంబగు రాజ్యంబు కపటద్యూతంబున దుర్యోధనుం డపహరించుటయు, అది వీరలు దిగ్విజయంబు యాలవరించుకొన్నపదంబగుటయు ......... ఈ రెండుదెఱంగులవారికిం బంచి కుడువందగుటయుం దలపోసి తగినకార్యంబు సెప్పవలయు" (ఉద్యో. 1-12.)

అని వారియభిప్రాయములను కనుగొనగోరి యింతలో మరల తనసంకల్పమునకు వ్యతిరేకభావమును వెలిబుచ్చుదురేమో యను వెఱపుచే "ఐనను నాకన్నంత సెప్పెద వినుండు" అని తనయభిప్రాయము నిట్లు వెలిబుచ్చెను.

"క. సంతతవినయములు సహాయము,
శాంతతమై నడపితేని భుజాబలమును దు
ర్దాంతోద్యమశౌర్యము నెఱి,
గింతుమనుమ మున్నవారి కిందుకెదఁగదుగదె.

"క. వీరితలం పెఱిఁగిన గాం
ధారితనయునకు సుహృద్విత్తానము గూర్చం
బోక బరిమార్తు రంచెను
వారైయున్నదనయని యవశ్యము గడకన్.

ఈ మొదలుగాగల పాండవుల యుద్ధసన్నద్ధస్థితిని తెలియజేసి కౌరవుల యభిప్రాయము తెలియుటకై "తగిన మానిసి నంపుల బుచ్చవలయు" అనెను.

అనంతరము సంజయునకు రాయభారమువచ్చి కృష్ణార్జునుల నేకాంతమున గలిసికొన్నప్పుడు ముందుగా అర్జునుడు తనప్రత్యుత్తరమీయబోగా కృష్ణుడు వారించి సంధికి మొదలె ఆస్పదములేనట్లును యుద్ధమునకు సిద్ధము కావలసినదనియు చెప్పుటయేగాక, తనమనోభావమును— అనగా కౌరవులను సంహరించిన నేగాని తనహృదయభారము తగ్గదనుభావము నిట్లు స్పష్టముగా తెల్లడించెను.

ఉ. ఎందును నెవ్వరుం బడని యెంతయు
గష్టముపాటువచ్చినం

గొందలమంది పాండువిభుకోడలు
దవ్వులనున్న నన్నుగో
విందుడ కావుమంచు బలవించుట
యీఁగఁగరాని యప్పుడో
లెందలపోయ వ్రేగయి చలింపకయున్నది
యప్పుడాత్మ మదిన్.

గీ. ఇట్టి యేదేనుగడపంగ నెందుమతికి
నెక్కు గాండీవమెత్తెఁ నెక్కువెట్టి
రెండు దొనలనుబూని కిరీటి యనికి
నమ్మ నేడెల్లియెందు బోవచ్చునీకు.
(ఉద్యో. II 129-130)

అనంతరము ధర్మరాజు శ్రీ కృష్ణుని రాయభారము పంపు సందర్భమున ఏవిధముగనైన సంధిచేయవలసినదని పలువిధముల కోరియున్నాడు. (ఉద్యో III 1-26 పద్యములు). మఱియు ధర్మరాజు కౌరవులదుర్బుద్ధినితలంచి కృష్ణునికేమైన హానిచేతురేమోయని భయపడినప్పుడు (ఉద్యో. III-28) శ్రీ కృష్ణుడు తానుగాక అన్యులెవ్వరయిన పోయిన తనసంకల్పమునకు భంగమువచ్చునని భయపడికాబోలు తన్నే పంపునట్లు ధర్మరాజునకు ధీర వాక్యము లుపన్యసించి పురికొల్పెను. ఇంతియగాక కౌరవులు సంధికొడంబడుటకల్ల అలదు "ముక్కున నావి కల్ల బుడమినీకీడుగావున పోరకలుగు। నేను గయ్యాళులకు నంబులెన్నియేని గంటి నీవనుత్సావిగాగవలదు॥ చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలంబురికొల్పుకొనుచు నాలస్యంబులేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండవలయు" అనిపలికెను.

అప్పుడు భీముడు తనయన్నగారితో సంపూర్ణముగ నేకీభవించుచు ఎట్లయిన సంధియే కావింపుమనియు, సమరంబు మాటలుచెప్పి తమను "వెఱపింపగవలదు" అనియు కృష్ణునికోరెను. (ఉద్యో. III 43-51) భీముడే శాంతవచనములాడుటచే తనసంకల్పమునకు గొప్పభంగమును కృష్ణుడు శంకించి ఆతని పూర్వమనోరథములను, ప్రతిజ్ఞలను జ్ఞప్తికితెచ్చి "యెవ్వరాకో యీ పితికితినమింత యలవడగఱపిన వారనుచు కౌరిగకల" నవ్వి మరల నొకమారతని కోపమును రగుల్పజేసెన (ఉద్యో. III 55-37).

ఈసందర్భమునసే అర్జునుడు కౌరవులతో నెట్లయిన సంధి గూర్పుమని అనేక విధముల కోరగ కృష్ణుడాతనితో

"అతనిగుణదోషముల నెందుమట్లయుండె
నాకు ధర్మజుబుద్ధి నడపవలయు
నిట్లెఱింగాచరింపంగ నేగి యచట
నెల్లతెఱగును నేర్పడ నెరిగివత్తు"

అనిపలికెను. ఇచట "ఎల్లతెఱగును" గమనించవలయును. పిమ్మట ద్రౌపతి నూరార్చుచు పలికిన మాట వలన శ్రీకృష్ణుని మనోభావము స్పష్టముగ దెలియచున్నది.

ఉ. ముచ్చిరనేల నేగలుగ ముద్దియనాకు
వృకోదరుండు వి
న్వచ్చుడు గోడుగాగ జనవంద్యుడు
ధర్మసుతుండువంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని
చేసెదగాక వేల్లోకం
డచ్చుపడంగ నేర్చునె దురాత్ములు
కౌరవులుర్వి యిత్తురే.

క. లలనా యుడుగుము నీ యే
డ్పులకొలదియె కురునృపాలపుత్ర కళత్రం
బుల యేడ్పులింక వానిం
గలకలనవ్వుచు వినంగ గాలంబయ్యెన్.

క. మొదల విధినియతియును న,
ట్టిద యెదురు పెద్దలదిఘటింపక పోదే
మదిచూచి చెప్పదను ద,
ప్పదు మేరువుడిరిగనేని పాంచాలసుతా.

తే. పూనిపలికెద వినుము రిపుక్షయంబు
జేసి యుజ్జ్వలపుణ్య లక్ష్మీసమేతు
లైన పాండుకుమారుల యధికవిభవ
మీవు నూచెదు తడవులేదిదినిజంబు.

ఈ మాటలన్న యర్జునుడు కృష్ణుని యుద్ధసంకల్పుడుగా నూహించి వారించుచు

"తే. పాండవులు ధార్తరాష్ట్రులు బుండరీక
నేత్ర చుట్టరికంబున నీకునొక్క-
రూపకావున గోరియేరూపునందు,
నుభయపక్షంబునకును జేయుము హితంబు"

అని ధర్మరాజుయొక్కయు తక్కిన పాండవులయొక్కయు అభీష్టమును జ్ఞప్తికిదెచ్చెను. అప్పుడు శ్రీకృష్ణుడు "కౌరవులకు మీకును హితము శ్రేయంబు కోరియే" వారియెడకు బోవుచున్నానని వాగ్దానము జేసి హస్తినాపురంబునకరిగెను.

కౌరవులతో సంధి చేయుటకు వెళ్లు రాయబారి యెట్లుండవలయునో నిరూపించుచు విరటుని కొల్వులో బలరాముడు చెప్పిన వాక్యములను యీసందర్భమున గమనింపవలసియున్నది. రాయబారి "ఎని యభిమతంబు సాధించునపుడు

ఆ. మాటపొందెఱింగి యోటమై నల్లన
చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి
కనుగుణంబుగాగ నానతుండగుచు
బ్రార్థించి యడుగకున్న దెఱగుపడదు.

వ. అది యెట్లనిన ధర్మనందనుం డతని యుద్ధలిక్రింబుయిలోడి మేపడిగల నడవడిం బ్రవర్తిల్లుచుండియు జూదంబువెంట మోసపోయి తోడరి చిక్కనంబడియె. నదియును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమియుం జేసియు బంధుజనంబులు దన్ను వారించుటయు దానాడుట మాని గాంధారరాజు నియమించినం దక్క- శకాకలంబునం బరిణతుండు గావున నాతని యాడి యుధిష్ఠిరుండొడ్డిన యొడ్డనంబులెల్ల గెలుచుచు వచ్చె. నట్లగుట నాతనియందును గొంతతేదిత్తెఱంగున వార లధర్మపరులని నిందింపరాదనికి కారణంబుగా వీరలు పుచ్చిన మానిసి వినయంబుతోన యీకార్యంబు దీర్చికొని రావలయును." (ఉద్యో. 1. 21-22.)

దుర్యోధనునికడకు పంపబడు రాయబారి ఇట్టివిధమున నుండినగాని కార్యము చక్కబడదను బలరాముని వాక్యములకును రాయబారిగావెళ్ళిన కృష్ణుని ప్రవర్తనకును ఎంతభేదముగలదో గనము చూడవలసియున్నది.

శ్రీకృష్ణుని రాక నెరిగి దుర్యోధనుడు ఆతని గౌరవముగ నీక్రిందవిధమున బ్రయత్నములుచేయించెను.

"ఉ విరిపరివారంబును గాంచి యతండు

క. అంబుడు మృగమదమున బ్రమ
గ్గులు నిట్టుడు నప్పురమున గుంకుమమున గో
డలు వూయుడు చిత్రిపావక
ములుగట్టుడు పెద్దకూటమున సొంపారన్.

వ. మఱియు నగరెల్లను శోభిల్ల నలంకారంబు సేయుడు.

క. వెనుపున జతురతమెరయగ
మనయింటను దుస్ససేను మందిరమున శో
భనశిల్పము నొనరింపుడు
వనుడు వృకస్థలమునందు జప్పరములిడన్.

వ. అది వీడుపట్టుగాదగియెడిపట్టని దెలిపి వాసుదేవుండు రేపకడ వచ్చునంతకు మున్న యింతయుం గావింప వలయునని పనిచి పురంబున నుత్సవంబు సాటుండని నియోగించి వివిధగంధమహితమాల్యంబులు సంపాదింపను మణిభూషణచిత్రాంబరంబులు సమకట్టను సరసాన్న స్వాదుపానద్రవ్యంబు లాడగూర్పను నేర్పరులగు తజ్జ్ఞుల నియమించె." (ఉద్యో. III 151-155.)

శ్రీకృష్ణుడు పురప్రవేశానంతరము, కృష్ణుడు కుంతి

నిజూడబోయినప్పుడు ఆమె నూరడించుచు నిట్లుపలి కెను:—

క. నీకొడుకులొండు సుఖములు
నేకొనరక్వీరసుఖమ చిత్తములఁ గరం
బాకాంక్షింతు రలంతుల
బోకగలుగునెట్టు లల్పబుద్ధులెవారల్.

. క. ఉత్సాహంబున శత్రుకు
లోత్సాదనవిధయొనర్చి యున్నతసామ్రా
జ్యోత్సవమునొందు పుత్రుల
నుత్సుకతం జూతు గాక యూఅనామింకన్."

(204-205.)

ఇట్టి మనోనిశ్చయముతో దుర్యోధనుని సభాస్థలం బునకరిగి "మధురసంభాషణంబులు చేయు"చున్నఁడు నెడ దుర్యోధనుఁడు భోజనవసతులను గురించి యుచ్చటించగా కృష్ణుఁడు "అచట తాను విడువనొల్లక యునికియొప్పగ చెప్పె." అంగ్ని సుయోధనునకు సంతోషాశ్చర్యములు గలిగి అతనిప్రవర్తన "బాంధవమునకు నీతికివిరుద్ధము" అని ప్రత్యుత్తరమిచ్చెను. అందుకు శ్రీకృష్ణుడు "మాతి లెందు దొలిదొలి గుడువంగొన గట్ట దొడగుదుఁ వచ్చిన కార్యముదీర్చి పిదప నీయుమ రెల్లన్" అను వింతవాక్యమును బలుక దానికి దుర్యోధనుండు

ఆ. వేగపడుటయేలె వినుము కార్యముతెలు
వీలకుండు దాని తెలుగు దగిన
యప్పుడాడరాదె యిప్పుడు మురద్రాటఁ
గాలుద్రువ్వనేల కమలనాభ.

వ. నీవు వచ్చినవాడవు మాయింటగుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట యొప్పుగాక కుడువనొల్ల ననం దగునె. దీనికి గారణంబు నాయెఱింగినయది లేదు." అని జవాబుచెప్పెను. కృష్ణుండు చిరునవ్వునవ్వి బలరాముడుపదేశించిన వాక్యముల మరచి, తాను రాయబారియను సంగతి జ్ఞప్తికి తెచ్చుకొనక తన మనస్సునయం దిమిడియున్న కోపమును వెలిబుచ్చుచు

"క. పగవారయింట గుడిచిన
నగు దఃకనుమాన మమృతమైనను దారుం
బగగుడకు గుడవబెట్టగ
దగదొడఁబల చెప్పడెవ్విధము వాటిలునో."

యని పల్కి కౌరవులు పాండవులకు చేసిన కీడులను జ్ఞప్తికితెచ్చి తాను కౌరవులకు పగవాడనని ప్రకటించి సంధికి వీలులేకుండ చేసెను.

ఈసందర్భముల నన్నిటిని విచారించినచో కృష్ణుడు విదురునితో చెప్పినట్లు "అన్నదమ్ములు లసులలోనంబోర కృష్ణుండు వారింపక యుపేక్షించె, నాచేత నకార్యం బడకాకని యుక్తులయిన జనులాడుదు"రను లోకాపవాదభయముచే మాత్రమే రాయబారమునకు వెళ్ళినట్లు కనపట్టు చున్నది గాని మనస్ఫూర్తిగ సంధి కావలయునని వెళ్ళినట్లు తోచదు. పాఠకు లీవిషయము నింకను తరచుగని కోరుచున్నాను.

—కోన సీతారామారావు (ఎం. ఏ.)

## మానసమునకు

ఉద్భవించితి రిపువురు నొక్క చోట,
వృద్ధిఁ గనినార రివ్వురు నేకముగను,
ఎన్నియుగములు కడచెనో యెఱుకపడదు;
కాని, మానసమా నీకుఁ గర్మమునకు
జనన మందిన దాది నీ దినము వఱకుఁ
గలుగదయ్యె వియోగ మేకాలమందు!
సృష్టికి యంతయు నీలోన నిమిడియుండు,—
నీవు లేకున్న సృష్టికిఁ దావులేదు
సంచరించుచు నీవుండు సమయ మెల్ల
కర్మ వర్తించుచుండు సౌఖ్యంబుగాను.

ఒక విధంబగు స్వాతంత్ర్య ముండు నీకు,
మఱియొక విధంపు స్వేచ్ఛ కర్మమునకుండు.
ఎట్టి కార్యంబు నైన నీ యిచ్ఛ వచ్చి
నట్టు లాచరించు స్వేచ్ఛ నీ యందుఁ గలదు.
అరయ నీజన్మ మందు నీ వాచరించు
కార్యములు నెల్ల నొక్కచోఁ గలియఁ గూర్చి
ముందు రానున్న జన్మము నందు వాని
కట్టు విడలించి కర్మ మా కార్యములకు
తగిన ఫలముల నొడఁ గూర్చుఁ దప్పకుండ.

కర్మమున కుండు స్వేచ్ఛ యిక్కరణినుండు
ఇటుల నీలోఁతు నంతయు నెఱిఁగి యెఱిఁగి,
వెంట నంటును కర్మ మేవేళ నిన్ను
అద్భుతంబగు నీ శక్తి నరయ లేవు
కర్మ కెంత ప్రభావంబు కలుగుఁ గాక,
నీవు తలచిన కార్యముల్ నిముస మందు
సఫలముల్ కావె నీకు నిశ్చలత యున్న!

-స్వామి.

# హిందూదేశము

జన్మస్థలమందును జన్మదేశమందును పూర్ణాభిమాన ముండుట మనుష్యస్వభావము. కాలవశమున విదేశవాసి యై యున్నను, జన్మదేశవార్తలు వినుటకును, తన దేశవాసులదర్శించి యాప్యాయతతో సంభాషించుటకును ఎంతో యభిలాష కలిగియుండును. జన్మదేశస్థితిగతులఁ దెలిసికొనుట కభిలాష యుండుట సహజము. కాని మన దేశములో విద్యాగంధము పెక్కండ్రకు లేని కారణమున దేశస్థితిగతులు వారికి దెలియనే తెలియవు. మనలో వేదశాస్త్ర పురాణవేత్తలున్నారు గాని దేశస్థితిజ్ఞాన విషయమున వారును విద్యాగంధము లేనివారికంటె నధికులు కానేరరు. మన పురాణములలో నక్కడక్కడ భూగోళవిషయములున్నను, అవి కాలక్రమమున మార్పుపొవుటచేఁ గాఁబోలు పెక్కువిషయములిప్పుడు సరిపడకున్నవి. ఆయంశములయినను మన భరతఖండమును గుఱించినవే కాని లోకమంతగుఱించి చెప్పఁబడునవి కావు. లోకమంతను గుఱించిన భూగోళశాస్త్రము మన పూర్వులు రచియించినట్లు కనఁబడదు. అందుచేత సంగ్రహముగా మన హిందూదేశ భూగోళవిషయముల దెలుపుమన్నాను. దేశసౌభాగ్యాకర్ణనము దేశాభిమానజనకము.

భరతఖండమను నామము శకుంతలా దుష్యంతుల పుత్రుఁడగు భరతునిచే గలిగెనని వాడుక. లోకమందుండిన నన్న నవఖండములలో నీ భరతఖండ మొకటి. దీనికే భరతవర్షమనియు, జంబూద్వీపమనియు, హిందూదేశమనియు నామములు. ఇంగ్లీషున దీనికి "ఇండియా" యని పేరు. ఏనామమే కాలమున వచ్చినదో యేలవచ్చినదో యిపుడు వర్ణింప నవసరము కాదు. ఇప్పుడాంగ్లేయుల పాలనమున బర్మా (బ్రహ్మ) దేశముకూడ నీ హిందూదేశపాలనమునఁ జేర్చియుండిరి. దీని కంతకు హిందూదేశ సామ్రాజ్యమని పేరు.

మనదేశము ఉత్తరమున మిగుల వైశాల్యము గలిగి దక్షిణమునకు రానురాను మిక్కిలి సన్నగిల్లినది. ఉత్తరమున, ౧౫౦౦ మైళ్ళ పొడుగును ౧౫౦ మొదలు ౨౦౦ మైళ్ళ వఱకు వెడల్పును గల గొప్ప పర్వతపంక్తి టిబెటుదేశమునకు మనదేశమునకు మధ్యనున్న హద్దు. దానికే హిమాలయపర్వతములని పేరు. ఆపర్వతములు నిరంతరము మంచుచేఁగప్పంబడి యుండును. లోకములో నెల్ల మిక్కిలి యెత్తయిన శిఖరమీ హిమాలయ పర్వతపంక్తిలో నున్నది. దానికి గౌరీ శంకర శిఖరమందురు. ఇంగ్లీషువారు దానికి "మౌంటు ఎవరెస్టు" అందురు. సముద్రపు మట్టమునకు దాని యెత్తు ౨౯౦౦౨ అడుగులు. రమారమి ఆరుదు మైళ్లు. ఇంతయెత్తుగల శిఖరముగాని, హిమాలయ పర్వతమువంటి దీర్ఘమైన పర్వతపంక్తిగాని లోకములో మఱియొకటిలేదు. సూర్యుని తీవ్ర చండకిరణములా శిఖరములందలి మంచుదిబ్బలను కరగింపలేకున్నవి. నిరంతరము మంచుచేఁగప్పఁబడి యుండుటచేఁ దెల్లగఁగనంబడి వెండి పర్వతమువలెఁ దోఁచుచుండును. అందుచేఁ

గాభోలు హిమాలయమే కైలాసమనియు, దాని చుట్టును పాఱుచుండెడు సింధునది- బ్రహ్మపుత్ర- గంగానదులు కైలాస శిఖరమునకుఁ జుట్టునున్న కందకము లనియు, కాశీపట్టణము శివనివాస శిబిరమునకు సింహ ద్వారమనియు వర్ణింతురు. మనచరిత్రలో హిమాలయ వర్ణనములో పార్వతి తపస్సు చేసిన చోటును, మన్మథుఁడ నంగుఁడయిన స్థలమును, మొదలగునవి వర్ణింపఁబడి యున్నవి.

ఈ మంచుకొండకు మూడుపంక్తులు గలవు. వానిలో మధ్యపంక్తి మిక్కిలి ముఖ్యమయినది. ఈపర్వత పంక్తిని దేవుఁడు దేశమునకు ప్రసాదించియుండుటచే నీపర్వతమందు లెక్కలేని నదులుద్భవించి యుత్తరహిందూస్థానమును మిగుల ఫలవంతము గు భూమిగాఁ జేసినవి. హిందూమహాసముద్రము మీఁదుగావచ్చునీటిగాలు నీ పర్వతమును దాటిపోనేరక మంచుకొండ యందలి శీతలత్వముచే మబ్బులలోని యావిరి ఘనీభవించి వర్షముగా దేశములో గురియుచుండును. ఈకొండలకావలప్రక్క కురిసినను సింధునది, బ్రహ్మపుత్రానదులు మన దేశములోనికే యానీటిని దెచ్చును. ఉత్తరమునుండి వచ్చు చలిగాలులను మన దేశములోనికి రానీయక యాపుటయేకాక యుత్తరమునుండి గొదలంచిన యేశత్రువున యిన రానీయని పెట్టనికోటలిగొడయై దేశమును సంరక్షించుచున్నది. కస్తూరిమృగము, జడలబఱ్ఱెలు మొదలగు జంతువులీపర్వతముల మొదటనుండు ప్రదేశమున నున్నవి. ఇక్కడ పులులును, ఏనుగులును విస్తారము. నల్లపులులున్నవి. కైలాసగిరియనుకొన్న యీపర్వతములందు లెక్కలేని పుణ్యక్షేత్రములున్నవి:— బదరీనారాయణము, బ్రహ్మకపాలము, పాండవేశ్వరము, మొదలగునవి. ఋష్యాశ్రమములు వెక్కులున్నవి. ఫలజాతులును వెక్కులున్నవి.

మన దేశమునకు దక్షిణపుకొననున్న కన్యాకుమారి యను నగ్రము మొదలు హిమవత్పర్వతములకు గల దూరము ౧౮౦౦ మైళ్లు. ఉత్తరమున వెడల్పు ౧౯౦౦ మైళ్లు. దేశము ముక్కోణాకారముగా నుండును. ఉత్తరమందలి హిమాలయములకు గల శాఖలు దేశమున పూర్వపశ్చిమముల వ్యాపించియున్నవి. అక్కడినుండి దేశముచుట్టు సముద్రమున్నది. మొత్తముమీఁద దేశమునకు లోభాగమునఁ జుట్టును పర్వతములే హద్దని చెప్పవచ్చును. దేశమునకు నించుమించుగా చుట్టును పర్వతములుండుటచేత పెక్కునదులాయా పర్వతములలోఁ బుట్టి దేశమందలి పంటలకుసదా తోడ్పడుచుండును. ఇంతజల సమృద్ధి గల దేశము లోకములో నింకొకటి కానరాదు. మంచుకొండకు తూర్పున వ్యాపించిన శాఖలగు జయింటియా, గారో, లూషాయి మొదలగుపేర్లు గల పర్వతములందు "చీరపుంజి" యను ప్రదేశమందు సగటున సాలునకు ౫౦౦ అంగుళములవర్షము కురియును. ఈ ప్రపంచమందింతటి వర్షముకురియు ప్రదేశమింకొకటిలేదు. అంగుళప్రమాణము వర్షమనఁగా నెందఱకు దెలియకపోవచ్చును. కురిసినవర్షము పల్లములకుఁబోకుండ, ఇంకిపోకుండ, సూర్యకిరణములచే నావిరిగా మాఱకుండ నెక్కడ పడినచినుకచ్చటనే యుండునెడల నాప్రదేశమంతయు నొకయంగుళములోతున నీళ్ళలో మునిగియుండునని తెలుపుటకొక యంగుళము వర్షమందురు. మనకు రెండు మడికట్లని, రెండు దుక్కులని చెప్పినఁ జెప్పవచ్చును.

ఈదేశ చమత్కారమేమోగాని సాలుకు ౫౦౦ మొదలుకొని రెండుమూడు అంగుళములు మాత్రమే వర్షము కురియు ప్రదేశములున్నవి. అందుచేతనే యరేబియాదేశవాసుఁడీ దేశమును చూచినచో వానిమనసు వివశమై యిక్కడి జలప్రవాహములకు, తోటలకు, రుచికరములగు ఫలసముదాయమునకు నాశ్చర్యసాగరనిమగ్నుఁడై దేశమునకు వేయిసలాములుచేసి వాసయోగ్యమని కాఁపురముండుటకు యత్నించును. ఒకవేళ తిరిగిస్వదేశమగు నరేబియాకుఁ బోదలంచెనేని చూపుమేర దూరములో చిన్నచెఱువుగాని చిన్నతోటగాని, చల్లనినీడనిచ్చుచెట్టుగాని కనపడక సికతమహాసముద్రమువలెనున్న యెడారిలోనికి బోవలసివచ్చెగదాయని కనులనీరుపెట్టుకొనకమానఁడు.

మనప్రభువు కాపురమున్న యింగ్లాండుదేశములో బుతుభేదమున్నను, కాలభేదమనగా వేసవికాలము వర్షకాలము శీతకాలమను భేదములు లేవు. మనకు మూడు కాలములును స్పష్టముగా గాన్పించును. అట్లని దేశమంతయు నొక్కతీరుననుండక యేకాలములో నేమిమార్పు కావలెనన్న నామార్పులుండెడు స్థలముల నేకములున్నవి. మే నెల యనగా వైశాఖమాసమందు దక్షిణ హిందూస్థానమున నోటినుండి పుక్కిలిని నీళ్ళుమిసిన నేలఁబడిననంతనే యింకిపోవునంతటి వేడిగాల్పులు వీచుచుండుమందు వేసవిలో,నుదకమండలమను నీలగిరిపర్వతప్రదేశమందు గజగజ చలిచే వడకుచుందురు. మనమా కాలములో రాత్రులు పంకాలు గట్టి విసనకర్రలు పట్టి విసరుకొనుచుండ నచ్చటివారలు నెగళ్లను వేసి చుట్టు దళసరి దుప్పట్లు కప్పి పరుందురు. హిమాలయప్రాంతముల నున్న భూభాగమను దేశమం దొకగోజనము బహానముచేసితిమేని భరింపశక్యముకాని వేడిమి, తలగాచుకొనవీలు నంగని వర్షము, మీరలేక ఉహుహు వాడించు చలి యనుభవింతుము. కాలభేదములున్నను, శీతోష్ణస్థితికి నలవడిన యేదేశవాసియైన నివసించుట కనువగు తావులు హిందూదేశమందుండుటచేత లోకములో నేదేశవాసియైన నీదేశమందు సుఖముగాఁ గాలమును గడపఁగలుగును; కాని మనదేశవాసి యితరదేశములకుఁ బోయెనేని నిచ్చట ననుభవించిన సుఖమొందనేరఁడు.

జలసమృద్ధిగల దేశమని చెప్పినంతనే పంట పొలఁతి నిరంతరము కలకలలాడుచుండునని చదువరులూహింపఁగలరు. ఇతరదేశములలోఁ గొన్నికాలములందు భూమియం దేసస్యములేక బోగులుబోగులుమనుచుండును. మనదేశమందు కాలభేదము గణింపనక్కఱలేక యెక్కడనో యొకచోట సస్యము లీకాలమాకాలమనక పండుచునేయుండును. లోకములోని యితరదేశములం "దీపంటలు పండును. ఈపంటలు పండవు" అను నియమము గలదుగాని మన హిందూదేశమందు మాత్రము లోకములోని అన్నిదేశములలో పండుపంటలు పండుటయేకాక యేదేశమందయినఁ బండనిపంటలుకూడ పండును. ఇది

గాక భూమండలము, ఉత్తరశీతమండలము, ఉత్తరసమశీతోష్ణమండలము, ఉష్ణమండలము, దక్షిణసమశీతోష్ణమండలము, దక్షిణశీతమండలమని యైదుమండలములుగా భాగింపబడినది. అయైదింటిలో ఉష్ణమండలమందు హిందూదేశముతోఁబాటు, దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఖండములలో భాగములును అరేబియా మొదలగు దేశములుగలవు. అట్టివానిలో సుఖతమప్రదేశమగా హిందూదేశమే. ఇందలి పండ్లకుగల రుచియు పుష్పములకుగల పరిమళమును ఇతరదేశములలో లభించువానికి లేవు.

ఈదేశమునకు నలంకారమును తెచ్చునవి నదులే. ఈదేశ నదులలో సింధునది యన్నిటిలో పెద్దది; కాని కొంతభాగము నిస్సారమగు నిసుకప్రదేశములోఁ బాఱుచుండుటచేఁ గాంబోలు నంతగా నుపయోగపడకయున్నది. అనగా గంగానది చేయుమేలులో సింధునది చేయునది చాలతక్కువ. దీని నిడివి ౧౮౦౦ మైళ్ళు. ఇతరనదులు పొడుగయినవియున్నను రెండుమూడు దేశములకు గలసి పాఱుచుండును. అమెరికాలోని మిసోరి మిసిసిపి, అమెజాన్-ఆఫ్రికాలో నైల్ గొప్పనదులే యైనప్పటికిని హిందూదేశపు నదులంత ఖ్యాతిగాంచకున్నవి. మనసింధునది బ్రిటిషుదీవులచుట్టు నొడ్డాణమువలెఁ బెట్టుటకు చాలును. బ్రిటిషు దీవులందలి యన్ని నదులు కలిసిన పొడవు మనదేశములోని నర్మదానది యొక్కదాని పొడవునకు సరిపోవును. బ్రిటిషుదీవులు హిందూదేశ వైశాల్యములో ౧౩వ వంతుండును. గంగానదివలె దేశమున కుపకారముచేయు పవిత్రమగు నది లోకములో నింకొకటిలేదు. గంగానది హిమాలయములందు జన్మించి మంచునీరు నిరంతరము గొనివచ్చుచుండుటచేఁ గాంబోలు నిందలిజలము ప్రయాగవఱకు తెల్లగానుండి దేశఖ్యాతికి వన్నె తెచ్చుచున్నది. యమునానదిలోని నీరు నల్లనిదగుటచేత ప్రయాగదగ్గఱ గంగలో చేరునప్పటినుండి గంగానది జలకాంతి మాఱుచున్నది. కలకత్తా మొదలు ప్రయాగవఱకు ప్రయాణము చేసితిమేని చుట్టు ప్రక్కల పొలములలో కాటుకవంటి చంద్రుమట్టియే కనఁబడునుగాని యొక్క చిన్నగులకరాయియైన దొరక

ము. అయోధ్యకు ముఖ్యపట్టణమగు లక్నోలో నొకప్పు డేదో పనికి ౧౦౦౦ (వేయి) అడుగుల లోతు త్రవ్వినను వంద్రుమట్టియే కనుపించినది. ఇంతగా బంగారమువంటి విలువగల వంద్రుమట్టి వేయుచుండుటచేతనే పంటలు విశేషముగాఁ బండగా ప్రజలు ధనికులైయున్నారు. అందుచేతనే కాంబోలు నుత్తరపుదిక్కునకు నధిపతిభాగ్యసంపన్నుడయినఁ గుబేరుడని వచించిరి. పాపమును హరింప సమర్థమగు గంగానదియొడ్డున నార్యులు మొదట ప్రవేశించి క్రమక్రమముగా నదిపొడవున నాక్రమించి దేవాలయములను కట్టుటచే నచ్చోవారికి భక్తిమెండై జ్ఞానసంపన్నత్వము లభించి యోగులగుచు వచ్చిరి. అందుచేతనే "ఉత్త[illegible]గి" యనుచుందురు- దేశము క్రమక్రమముగా జనాకీర్ణమైయున్నను, ప్రజలింతకన్నఁ బదిరెట్లు వృద్ధియైనను, పట్టణములు, పల్లెలు, గ్రామములు కట్టుకొనుటకు పంటకనుకూలమగు భూవసతిలభించుటకు దగిన మహారణ్యములింకను దేశమందు నెన్నో గలవు.

లోకములో నేయితరదేశమందుగాని ఏఖండమంతలోగాని యీహిందూదేశమందు వాడుకలోనున్నన్ని భాషలు లేవు. లోకమందు బయల్వెడలు ఖనిజజాతులన్నియు హిందూదేశములో దొరకును. భూమండలములో బ్రిటిషు దీవులు భూభాగమునకు నిం[illegible]మమించుగా మధ్య నున్నట్లు పూర్వార్ధగోళములోన హిందూదేశమట్లు మధ్యగానున్నది- అందుచేతను, ౫౦౦౦ మైళ్లపొడుగుగల సముద్రతీరముండుట చేతను వర్తకమున కనుకూలమగు దేశము- ఇట్లు వాసయోగ్యమై, నిత్యసస్యభూషితమై, వర్తకమునకనుకూలప్రదేశమై సర్వఖనిజధారిణియై దినదినము మనమాతృభూమియందభిమానము మాపుట [illegible]యటుండ, హిందుదేశ వాసియనుకొనుట [illegible] హేతువగును.



[illegible] సూర్యనారాయణరాజు

## విచారలహరి.

ఏరాత్రినీచుక్క లిటుపుట్టినాయొ
నారాత్రినేగిట్టు నంచునుదెలిసి
ఏయెండకీపూవు లిటువిచ్చినాయొ
నాయెండనేవాడు నంచునుదెలిసి
ఏగాలినీమబ్బు లిటుకూడనాయొ
నాగాలినేవీడు నంచునుదెలిసి
వాసనా కలితభాగ్యంబును మఱచి
క్షణభంగురంబైన స్వసుఖంబునమ్మి
అక్షయదుఃఖంబు లనుభవించుటకు
దొరకొంటి విదియేటి దుర్బుద్ధినీకు!
నిజమెఱుంగవిదేటి నిస్పృహానీకు !
హృదయమా! తత్త్వమూహించి మేలెంచి
యనుభవ సిద్ధవాక్యంబులాలించి
చింతాలహరిలోనఁ జిక్కకమనుమ !—
వినువీథి కెగురంగ వేసినరాయి
పుడమిమీఁదే పడిపోవునంచెఱింగి
పుడమిలోపలఁబుట్టి పెరిఁగినచెట్టు
ఒకగాలిదెబ్బకే యొఱఁగునంచెఱిఁగి
జలములఁబుట్టిన జలబుద్బుదంబు
లంతలోపలమాయ మౌనంచెఱింగి
ఎగిరిపాటునకేల యీయుద్ధతంబు?
ఔన్నత్యమునకేటి కావిస్మయంబు?
ఆమహోదయమున కాశ్చర్యమేల?
హృదయమా! తత్త్వమూహించి మేలెంచి
యనుభవసిద్ధ వాక్యంబులాలించి
చింతాలహరిలోనఁ జిక్కకమనుమ !!—
జలధరంబులయందు జలములేగాక
పిడుగులేమిటికిఁ గల్పింపఁగాఁబడెనో?
ఫణిఫణంబున విషపటలమేగాక
మాణిక్యమేటి కమర్పఁగాఁబడెనో?

అంబుధులలోఁబడబాగ్ని యేందులకో!
తత్త్వమార్గంబును దలపోసిచూచి
ద్వంద్వభావ సమాశ్రితంబైన పుట్టి
ప్రాపంచమునకేకభావమేయనుచు
నుల్లమా! విశ్వాసముంపఁగా నొక
యనుభవసిద్ధ వాక్యంబులాలించి
చింతాలహరిలోనఁ జిక్కుకొనుటయ!!!—
అనవరతంబును నమృతరసంబు
గురిసెడు కోకిల కూజితమకట!
కాలకూటవిషాగ్ని కంటెను మిగుల
సంతాపమునుగూర్చు చందమూహింప
నీవస్తువునకును నిట్టిగుణంబు
గలదంచు నూహింపఁగా దెవ్వరికిని,
కాని, జీవుల పూర్వకర్మానుభవమె
యన్నిటికిని మూలమగు నంతెకాని
యమృతరసంబైన నమృతరసంబు
కాలకూటంబైనఁ గాలకూటంబు
గలదంచు నూహింపఁగాఁ బోకు మెప్పుడు
హృదయమా! యనుభవమింతకుఁగనుము!
చింతాలహరిలోనఁ జిక్కుకొనుటయ!!!—

—— శాలాంత్రపు వేంకటరావు.

# గ్రంథ విమర్శనః "ప్రభాతము" *

ఇది కృష్ణదేవరాయల కథకు సంబంధించిన నవల. అనేకవచనగ్రంథములనువ్రాసి ప్రఖ్యాతులగు శ్రీ వంగూరి సుబ్బారావుగారిచే రచింపబడినది.

ఈ నవల శైలిమృదులము; మనోహరము. ఏకాకృతి గల్గి ప్రతివాక్యముగూడ నొక్కద్రుతముతో ముగించు కొందఱాధునికుల శైలివలె తలనొప్పి పుట్టించునది గాదు. మఱియు వంగభాషనో మహారాష్ట్రభాషనో చూచి వ్రాఁతలు పెట్టుకొనిన అర్థములేని సంస్కృతపదము లిందులేవు. ఇది యేభాషలోనికిఁ బరివర్తింపఁబడినను గ్రంథకర్త తెలుఁగువాఁడేయని స్పష్టముగాఁ జాటఁజాలు తెలుఁగు మాటలచేతను తెలుఁగు భావములచేతను బోషింపఁబడినది. అన్నిటికన్న నుదాత్తమగు గుణమొండుఁగలదు. అది సామాన్యముగ నేఁడాంధ్రుల కల్పితప్రబంధములలో దొరకనిది. ఏమనఁగా: ప్రతిపాత్ర మాడు మాటయును సామాన్యముగా స్వభావము చెప్పుడును మీఁదు అనేకులకుఁ గథారచనమునందుఁగల యాసక్తియు శక్తియుఁ బాత్రవ్యక్తీకరణమునందుండదు. శ్రీ వంగూరి సుబ్బారావుగారికి మాత్రము పాత్రస్వభావపోషణమునదృష్టియెక్కువ. శ్రీకృష్ణరాయల పాత్రనా యము కర్తగారి హృదయమందలి యాంధ్రాభిమానము నంతయు వ్యక్తీకరింపఁజేయఁగలిగినదనుటకు నీనవలయందలి ప్రతిప్రకరణమునందలి ప్రతిపంక్తియు సాక్ష్యమీయఁ గలదు. ఇందలి వర్ణనలన్నియు స్వాభావికములు. ఈగ్రంథమునందు దోషములకన్న గుణములే సంఖ్యలో నధికములగుటచే, గ్రంథవిస్తరభీతిచే గుణములను గుఱించి యింతకన్న ఎక్కువగా వ్రాయక దోషములను కొంతవఱకు వివరించెదను.

సామాన్యముగ నవలలు చారిత్రికములని సాంఘికములని రెండువిధములుగ విభజింతురు. అందు మరల కథాప్రధానములనియు స్వభావనిర్వచనప్రధానములనియు రెండు భేదములఁ గల్పింపవచ్చును. కథాప్రధానమగు నవలలో గ్రంథకర్త యేపాత్ర యేకార్యముఁ జేసినను, ఏమాటయుచ్చరించినను అంతయు మూలకథకే సహాయముగానుండునట్లు రచించును. కథకు సంబంధింపని యే విషయమందు పొందింపఁబడినను కర్తయాక్షేపణీయుఁడే. అందెట్టి సంక్షేప విక్షేపములకును నవకాశముండరాదు. ఇఁక స్వభావప్రధానమట్లుగాదు. ఇందుఁగథ యత్యల్పముగానుండును. మానవప్రకృతిని ప్రతిఫలింపఁ జేయు

* పిఠాపురమునందుండు శ్రీరామవిలాస గ్రంథమాలయందు ద్వితీయకుసుమము వెల 0--12--0,

టయే కర్తయొక్క ప్రధానోద్దేశము. కథాప్రధానమందు స్వభావము కథకుఁ గింకరము. ఉన్నదంతయు స్వాభావికముగనే యుండవలయును; కాని స్వభావనిర్వచనమునే ముఖ్యముగానుంచుకొని కథకు సంబంధింపని, కథాప్రవాహజనిత కుతూహలమునకు భంగము గలిగించు, విషయములఁ జేర్పరాదనుట. ఇట్లే స్వభావప్రధానమగు నవలయందు కథ స్వభావమునకుఁ గింకరము. మనుష్య స్వభావమునందలి ప్రభేదములను జిత్రించుటకై అవాంతరములగు పాత్రములు చరిత్రములు సల్లాపములు నెన్ని వ్రాసినను గర్త నిందార్హుఁడు గాఁడు. మఱి సూక్ష్మదృష్టికౌశల్యముచేఁ బొగడ్తకుఁ దగువాఁడు.

శ్రీ కృష్ణదేవరాయలు గజపతిపుత్రిక యగు తుక్కాంబను వివాహమాడుటయను చారిత్రాంశము (ఇది చారిత్రాంశమే యను విషయము నిర్ణీతము కాదు) మూలముగాఁ గొని స్వకల్పనలచే రచింపఁబడినది గావున ప్రకృతము మన నవల చారిత్రిక మనఁబడవచ్చును గాని, ఇది కథాప్రధానమా స్వభావప్రధానమా యను విషయమును నిర్ణయించుట కష్టము. ఏలయన స్వభావప్రధానమగునని వర్ణనవిస్తరము లేనిది నవల హృదయంగమము గాదు. స్వాభావికముగ నొకమాటయొక కార్యము వచియించినమాత్రమున వ్యక్తి యితరావచ్ఛేదముతో మనయెదుట నిలువఁజాలదు. ప్రకృతాఖ్యాయికయందలి నిర్వచనములన్నియు జాలసంకుచితములు. ఇఁక కథాప్రధానమనుటకు అపూర్వమై చదువరుల హృదయములను సందేహపాశములచే బంధించియూ గాడింపఁజాలి, నిద్రాహారముల కెడమీయని కథాసంవిధానము గావలయును. ఇదియంతయు దారమగు కళకాదని కొందఱందురు; ఐనను కవిత్వశక్తిచేఁ బోల్చిచూచిన నిందుఁ గొంత సత్యము కలదని తోఁచును గాని, యట్టికథ కల్పించుటకును దానిని కథారూపమున నేర్పఱచుటకును అసామాన్యప్రతిభ కావలయుననుట మాత్రము సత్యము. ప్రకృతము 'ప్రభాతము' నందట్టికల్పనలేవియుఁ గానరావు. ఇందు గ్రంథకర్తగారు కల్పించిన కల్పనలు ముఖ్యముగా మూఁడు:—

(౧) స్వప్నము. శ్రీ కృష్ణదేవరాయలు స్వప్నమునందు తుక్కాంబను జూచుట, ప్రబంధనాయకులవలె మరులుకొనుట. ఇదియే నవలకు బీజము; ఈకల్పన మిదివఱకు హిందూసాహిత్యమునఁ బ్రతికల్పిత గ్రంథమందును బడి పిప్పైపోయినది. ఉషానిరుద్ధులే ద్వాపరయుగమున దీనికిఁ బునాది వేసిరి. నేఁడు దీనికిఁ గ్రొత్తదనమేమియు లేదు; ఎన్నఁడును జూచియుండని తుక్కాంబను స్వప్నమున రాయలు చూచుట, మనోవినోదార్థము ఆ చిత్రపటమును వ్రాయుట, తిమ్మరసుగారు రహస్యముగ దానిని గైకొని యిరువురకును మధ్యవర్తియై తుక్కాంబ చిత్రపటమును గజపతి నగరమునుండి చారముఖమునఁ దెప్పింపఁగా కల్పనాబలము యొక్క తలవ్రాఁతచే రాయల వ్రాతయు నాయూరి చిత్రకారుని వ్రాఁతయు రెండు నొకటేతీరుగ నభిన్నమైయుండుట, పరార్థజ్ఞానమైన తరువాత వివాహప్రయత్నములు చేయుట, ఇత్యాది కల్పనలు ఈయిరువదవ శతాబ్దపు నాగరకత వహించు గౌరవమునందేఁ జెల్లవనుట వేఱె చెప్పనేల ?

(౨) గజపతిని భేదోపాయముచే నిర్జించుట. మహామంత్రీయులు రాయలపైఁ గుట్రసలిపి గజపతిని దమలోనికీడ్చుకొనిరి. ఆ మహామంత్రియుల గెల్చి రాయలు గజపతిపై దండెత్తఁబోవులోపల పదునార్వురు సామంతులతనికిఁ జేయూఁతగా నిల్చిరి. వారినందఱ గెల్చుట యసాధ్యమని తిమ్మరసు, తామిచ్చు లంచములకు లోఁబడి వారందఱుఁ జేరి యుద్ధమున గజపతిని రాయలకుఁ బట్టియిచ్చుటకు సిద్ధులైయున్నారను నభిప్రాయము వచ్చునట్లుగా పదునాఱు లేఖలను వ్రాసి బహుమానములతోఁ గూడ నాపదునాఱు లేఖలను జారులమూలమునఁ బంపుచు, వదుమ వాచారులు గజపతిచేతికిఁ జిక్కునట్లు చేసి, తన్మూలమున నతనికి నాసామంతులపై దురభిప్రాయము గలిగించి భయపెట్టి యిరువురను విడఁదీసి యేకాకియగు నాతనిని రాయలకైవసము చేయును. ఈకల్పనము కొంత చిత్రమైనదే కాని యిది శ్రీ సుబ్బారావుగారిచేఁ గల్పింపఁబడినది కాదు; ముద్రారాక్షసనాటక కర్తయగు విశాఖదత్తునిది. మలయకేతువునకును అమాత్యరాక్షసునకును భేదముఁ గల్పించుటకై చాణక్యుఁడే యుపాయ

మును యాశ్రయించినాఁడు. నాటియు నందలి కల్పనా వైచిత్ర్యమింత లేదు. • అమాత్యరాక్షసుఁడును సామంత రాజులు నేకమై మలయకేతువు నాశ్రయించియుండుటచే నా రాక్షస మలయకేతువులకు భేదముఁ గల్పించుటకై, రాక్షసుఁడే సామంతరాజులను లోపఱుచుకొని మలయకేతువునకు ద్రోహ మెంచినట్లు లేఖను రాక్షసుని లేఖరిచేతనే వ్రాయించి యందు రాక్షసముద్రను వైచి యది మలయకేతువునకు లభించున ట్లసాధారణమైన తంత్రము చాణక్యుఁ డొనరించును. ప్రకృత గ్రంథమున నన్ననో తిమ్మరసు తానే వ్రాసి పంపుచున్నాఁడు. కావున నిందలి యుపాయమునందు నపూర్వత యేమియు లేదు. మఱియుఁ దిమ్మరసు పదునాల్గురు సామంతులకును వ్రాసిన పదునాలు లేఖలయందును నొక్కటే పద్యము వ్రాయఁబడియుండెనఁట :—

"సీ. శ్రీమతు కర్ణాట సింహాసనాధ్యక్షుఁ
డగు కృష్ణరాయ భూనాథునాఁ
డల పదాలుగురు సామంతులకు సంప్రీతిఁ బం
పిన సులేఖంబులు................"

ఒక్కొక్క లేఖయందుఁ బదాలుగురు పాత్రులును సంబోధింపఁబడి యుండిరా? అట్లయినచోఁ బదునాలు ప్రత్యేక లేఖలు వ్రాయుట తిమ్మరసు తెలివిలేనితనమా?

(3) పార్వతమ్మ, సూరన్న వీరి చరిత్రము. వరద రాజమ్మ సాహాయ్యముచే పార్వతమ్మ పదియేండ్లుగాఁ గాశికి నందఱును విడిచి పోయియుండిన భర్తను గొంత విచిత్రముగాఁ దన్నుఁ దెలిపికొని యతనిం బొందును. ఇందు వరదరాజమ్మ తానుంచిన యన్నసత్రమునందు భుజింపవచ్చిన సూరన్నను బలాత్కారముగఁ బట్టితెప్పించుట, యతనితో పార్వతి నేరుగ ముందుగనే నిలిచి సంభాషించుట, వినోదసల్లాపానంతరము లేచియెత్తి నిర్గాఢంతుఁడగు నతని మెడలో పూలహారము వేయుట మొదలగు కల్పనలు పూర్వకాలపు టూకుడు కథలందును ఈ కాలపు బంకించంద్రుఁడు మొదలగువారి నవలలయందును సామాన్యములు. నవలలనెన్నఁడును చదివియుండనివారికి నపూర్వములుగ నుండును గాని, కొంతచదివి యలవడిన వారికి ప్రాఁతవి.

లెక్కకురాని యొండురెండు చిల్లర సంవిధానములు తప్ప నాకుఁ జూడ, గ్రంథకర్తగారు నూతనముగఁ జేర్చిన కల్పనలివియే. కావుననే యీ గ్రంథమునందుఁ గథకు ప్రాధాన్యము లేదంటిని.

• ఇటులుమిందముగఁ దిక్కన కథాసంవిధానములన్నియు వాస్తవిక నాశ్రయించినవి. వాస్తవికలోనున్నవన్నియుఁ గథాకల్పనమునందు సందుకోరికినప్పుడితికించుట వీరి ముఖ్యోద్దేశములలో నొకటి. జనశ్రుతి వెంబడి ప్రవహించు విషయములకుఁ గార్యకారణ సంబంధము చాలనల్పముగనుండును. కావుననే వానినస్లే నమ్ముట యొక్క గొప్పలోపము. ప్రకృత గ్రంథకర్తగారన్నియు హృదయపూర్వకముగ నమ్మినవారలేను గాని, కథాకల్పనకు వాని నెల్ల సంగములుగాఁ గైకొనుటచే అనౌచిత్యము, అనావశ్యకత, అసంభవము మొదలగు లోపములకుఁ గథను పాల్పఱచియున్నారని మాత్రము చెప్పవలసియున్నాను.

వాడుకకుఁ జేరి యీ గ్రంథమున ప్రాముఖ్యము వహించిన పాత్రములలో ముఖ్యపాత్రము నాగిని. ఈమెయే గజపతి కూఁతురగు తుక్కాంబ. వరదరాజమ్మ, రుచిదేవి, అన్నపూర్ణమ్మయని యీమెకు మూఁడు నామాంతరములు. ఈ కథానాయిక చరిత్రమునందు ముఖ్యమగు నసంభవములు మూఁడు:—

(౧) కృష్ణదేవరాయలను పెండ్లాడిన తరువాత నతఁడు హీనకులజుఁడు కావున నతని సంహరింపుమని దాసి తుక్కమ్మను బోధించును. పతివ్రతాతిలకమగు నామెకిష్టములేని కార్యమును, అంతగాఁ బట్టుపట్టి బోధించి సాధించునంతటి యావశ్యకత యా దాసికేమి కలిగినది? తరువాతఁ దన యజమానురాలి గతియేమి? శాశ్వతబ్రహ్మచర్యమా? ద్వితీయ వివాహమా? స్వేచ్ఛావృత్తియా? కూలికై పనిచేయు నా హీనకులజురాలగు దాసి, గ్రంథకర్తగారి యిష్టానుసారముగ 'గజపతుల గౌరవము నిలువఁబె

ట్టుటకు' అందఱకన్న నెక్కువగా కన్యాభర్తృసంహారమునకై బలవంతపెట్టుచుటఁ జూడ, నది కలియుగమున నవతరించియుండు మంథరయే కాని వేఱు కాదని తోఁచెడిని.

(౨) కృష్ణదేవరాయలచేఁ దిరస్కృతయై రుచిదేవి యొకపల్లెలో యోగినియై కాలముఁగడపును. గజపతి నగరముదాఁక విడిచిరమ్మన్న కృష్ణదేవరాయల యాజ్ఞకు వ్యతిరిక్తముగా నడత్రోవ నామెను నీగతినీదని విడిచివచ్చిన చారులు రాయలతో నేమి సమాధానము చెప్పిరి? అతఁడు వారల విచారింపనేలేదా? తరువాతి సుమారు డెబ్బదియేండ్లదాఁకఁ దల్లిదండ్రులకుఁగూడ నీసమాచారము తెలియదు. ఇట్టిదంతయు దిక్కులేక నట్టడవిఁబడిన యాయోగినికి 'లక్షలకొలఁది' ద్రవ్యము నెట్లు వచ్చి నిత్యమును లెక్కలేని దానములు చేయు సామర్థ్య మెక్కడినుండి వచ్చెను? విజయనగరమునుండి బహిష్కృతయై వచ్చినప్పుడేమైనఁ దెచ్చియుండెనా? ఆమె యొక్క బ్రాహ్మణునకు దానమిచ్చిన స్వర్ణగోవు "మూరెఁడెత్తుగలది!" ఇంత ద్రవ్యము నామె కెవ్వరు గుప్తదానముఁజేసి పుణ్యముఁ గట్టుకొనిరో గ్రంథకర్తగారు కూడ నెఱుఁగరు కాఁబోలు! ఈకల్పనకుఁ గాళ్ళును చెవులును లేవు!

(3) యోగిని యగు రుచిదేవి మందిరమున నొక కృష్ణదేవరాయలవిగ్రహము. అందొక కేతకీదళము. దానిలో నైదుసంస్కృతపద్యములు వ్రాయఁబడియుండఁగా రాణులు దానిని చదువుచున్నట్లు చిత్రింపఁబడియుండెను. ఆకస్మికముగా రాయలేవచ్చి దానిని చూచి చదువును. నైపద్యములైదును 'తుక్కా-పంచక' మను పేర వాడుకలో వచ్చుచున్నవి. ఈసందర్భమున గ్రంథకర్తగారు వైవాహికను కథలోఁ జేర్పవలయునను నొక్క యుత్సాహముననుండిరే కాని, తామేర్పరిచిన యోగిని స్వభావమునకును నైపద్యములందలి భావములకును అనురూప్యమున్నదా లేదా యని చర్చింపరైరి. ఆ న్యాపదేశరూపములగు నాపద్యములందెల్ల నాయిక ఆత్మస్తుతియు నాయకనిందయుఁ జేయును. అందలి కడపటిపద్యము మాత్రము చిత్తగింపుఁడు:—

"కింమాలతి! * మ్లాయసి? మాం విహాయ
చుచుంబ తుంబీ కుసుమం షడంఘ్రిః?
లోకే చతుర్భిశ్చరణైః పశుః స్యాత్
షడఙ్ఘ్రి రత్యర్థ పశు ర్న కిం స్యాత్?"

"ఓమాలతీలతా! నీవేలవాడువాఱెదవు? ఈతుమ్మెద నన్ను విడిచి తుమ్మిపూవును ముద్దాడెనని యా? లోకమున నాలుగుకాళ్ళున్న నే పశువనఁబడును. ఇఁక నాఱుకాళ్ళు గలిగినేని మిక్కిలియుఁ బశువగునని వేఱ చెప్పనేల?" యని యీపద్యభావము.

యోగిని పశ్చాత్తాపతప్తురాలు. తప్పు తనదిగాని రాయలది కాదని పలుమాఱు ఘోషించుచున్నది పతివ్రతాతిలకము; అట్టిది రాయలు పశువని తాను నిర్దోషురాలని యన్యాపదేశముగాఁదిట్టుననుట యుచితమా? సంభావ్యమా?

నాయిక విచిత్రముగాఁ గుదుర్చఁబడిన పిదప నాయకుఁడును కవిగావలయును. గ్రంథకర్తగారి యదృష్టవశమున రాయలు స్వయముగనే కవిగా నున్నాఁడు. అతఁడును నాయికను స్వప్నమునఁ జూచి విరహాగ్నిదోదూయమానమానసుండగుచు స్వప్నగతవిషయముల యసత్యతను గూర్చి చిన్నఁగా నొక 'సానెట్టు' పాడుచున్నాఁడు. అదియొక గీతమాలిక. ఆముక్తమాల్యదను రచించినది కృష్ణదేవరాయలే నిజముగునేని ఈగేయములందలిని కవితాగంధమైనను లేదని చెప్పవచ్చును. అదియెట్లున్నను ఆకాలమున సామాన్యముగానుండిన చంపకాదిచ్ఛందోమార్గమున నీపద్యములు వ్రాయఁబడియుండెనేని యుచితతరముగానుండియుండును. ఆంగ్లేయకవిత్వ మనుకరించు *ఆధునికులు తప్ప గీతమాలికను ప్రాచీనులలో నెవ్వరు వ్రాసినవారు

* "కింమాలతింమ్లాయసి" యని గ్రంథకర్తగారి పాఠము. దానికి నర్థము నాయెఱుఁగినంతలో లేదు.

లేరు. చంపకమాలికాదులు వ్రాసినట్టుగానే గీతమాలికలు గూడ నేల వ్రాయుచునుండియుండఁగూడదని ప్రశ్నింతురేని, కోటిచ్ఛందస్సంస్కారులకు లేని నిర్యతిప్రాసపద్యములుగూడ నేలవ్రాసియుండఁగూడదను ప్రతిప్రశ్నయే ప్రత్యుత్తరము. బలవత్తరమగు నాధారము లేకయున్నను ఊహాబలముచే చారిత్రక విషయములు నిర్ణయింపఁ జూచెదమేని యిఁక నిర్ణయింపరానిదేది? కృష్ణరాయని శిల్పకళాకౌశల్యముగూడ నిట్టిదే. ఎవఁడోయొక ప్రాచీనరాజు చిత్రమును చక్కఁగ వ్రాయఁగలైనన్నమాత్రాన నందఱును పూర్వకాలమున చిత్రకళాప్రవీణులై యుండిరని స్థాపించుట చరిత్రవిషయమునఁ జాలనన్యాయము. కవిత్వమునఁ బ్రసిద్ధుఁడగు రాయలకు చిత్రలేఖనసైపుణ్యమును సమకూర్చిన గ్రంథకర్తగారు సంగీతము నేల మఱచిరోయెఱుఁగను! మూఁడు కళలనుండిన నింకను బరిపూర్ణుఁడుగా నుండునుగదా నాయకుఁడు! మనము మనప్రాచీనులను నిష్కారణముగా నెంతయున్నతస్థానమునఁ గూర్చుండఁబెట్టిన నంతయుగౌరవమని సాంతము!

ఈనవలయందుఁ గల కథలు రెండు. రాయలచరిత్రము, పింగళి సూరన్న చరిత్రము. వరదరాజమ్మయే రుచిదేవియను తెలిసినవిషయమును పార్వతి తిరుమలదేవికిఁ దెలియఁజేయుటతప్ప రెండుకథలకును సంబంధమేమియును లేదు. 'పెద్దన్న శిష్యుఁడు భట్టుమూర్తి; మనుమరాలిమగఁడు సూరన్న; తాతచేనవమానింపఁబడి సూరన కాశికిఁబోయి పండితుడైవచ్చి తన రాఘవపాండవీయమునందలి దీర్ఘసమాసభూయిష్ఠ పద్యములచే నతనిని మెప్పించెను.' ఇది కింవదంతి. దీనిని అష్టదిగ్గజముల కథగాదు. కథలోఁ జేర్పఁగోరినారు గ్రంథకర్తగారు. కానియీపాత్రముల యావశ్యకత కలిగిన కథమాత్రము కల్పింపరైరి. కావుననే సూరన రాఘవపాండవీయమువలె నీ'ప్రభాతము'ను పరస్పర సంబంధములేని రెండు కథలచేఁ గూర్పఁబడినది. ఈకథయందు గ్రంథకర్తగారు పెద్దన్నకును సూరన్నకును దలకొకయపకీర్తి సంపాదించినారు. సూరన రాఘవపాండవీయము పెద్దనకు జదివివినిపించునప్పుడు "తలఁపంజొప్పడి యొప్పెనప్పుడు" అనిచదువఁగా 'నింతలోనే నాలుగు విఱుపులా?' యని పెద్దనప్రశ్నించెనఁట! అందుపై నేకసమాసముగాఁ బద్యమంతయు నొక్కగుక్కగా సూరన వినిపింపఁగా "నాయనా! ఇప్పుడు నీవు నామనుమరాలి మగఁడవోయి!" అని పెద్దన మెచ్చుకొనెనఁట! వాడుకగానున్నంతవఱకు నీపుక్కిటి పురాణమునకు గౌరవముగలదుగాని, యిదియాతని సత్యమైనస్వభావముగా గ్రంథకర్తగా చెప్పఁబూనుట యన్యాయము. మనుచరిత్రమందొక పద్యమైనఁ జదివినవారు దీనినమ్మరు. "అల్లసానివాని యల్లికజిగి"కి దీర్ఘసమాసప్రావీణ్యమని యెవఁడో యవ్యావర్తకుఁడర్థముచేసి యీవాడుకను కల్పించెను గాని దానిని గ్రంథకర్తగారు నమ్ముటయు, సత్యమని చదువరుల నమ్మింపఁజేయుటయుఁ బెద్దనార్యుని విషయమందొక గొప్పయపచారము. మనుచరిత్రమంతయుఁ గూడ రాఘవపాండవీయపద్యశైలిలోనే వ్రాయబడియుండెనేని పెద్దనార్యుని యాంధ్రకవితాపితామహబిరుదము నిలువదు.

ఇఁక సూరనార్యుని రాఘవపాండవీయము అకువీటి పెదవెంకటాద్రికి సంకితమైనది. పెద్దనతోఁ జదివివినిపించునప్పుడు "మొదటి ప్రార్థనపద్యములును, కథలోస్వల్పభాగమునైనను. కృతియెవరికినీయలేదు" అని సూరన చెప్పుచున్నాఁడు. అట్లయినచో నప్పుడు నాందీపద్యములందలి పెదవెంకటాద్రిపేరున కేమిగతి? మొదలే గ్రంథమంతయు వ్రాసి కృతినీయవలసినచ్చువేళ మాత్రము నాందిపద్యములఁ గొంతమార్చియిచ్చినాఁడు సూరన యని నిష్కారణముగా నమ్మవచ్చునా? "నీసుదిక్షఫలాపేతు ఘనంబుగాద"ని పెదవేంకటాద్రిచే పొగడఁబడినవాఁడు, అతనిచే సత్కారములంబొంది రాఘవపాండవీయమును 'శ్రీవిరూపాక్షున కంకితంబుగ' సమర్పించిన ధీరుఁడుగదా సూరన? మఱియుఁ బెదవేంకటాద్రి వేఁడికోలుచేతనే కదా రాఘవపాండవీయకృతినిరచించెదననుచున్నాఁడు? ఇట్టివాఁడు పెద్దనకాలములోనెట్లుగ్రంథ ముపక్రమింపగల్గెను? అంతేగాక యెవనికి కృతినిత్తునాయని తాంబూలమునకై వేచియుండెనను భావము స్పష్టముగా నిందు దోఁచుచున్నది. ఇంత నైచ్యము సూరనార్యుని తలకు గట్టుట యుక్తముగాదు.

ఇంతియే కాక గ్రంథకర్తగారు శ్రీకృష్ణదేవరాయల కాలమునకే యిరువదవశతాబ్దపు నాగరకతావాసన కొంత తగిలించినారు. తుక్కాయమ్మగారి దాసీజనులిరువురిలో నొకదానిపేరు 'సుందరి' రెండవదానిపేరు 'సరళ' యఁట! 'రుచిదేవి' యనునది కూడఁ గల్పితమేయని తోఁచుచున్నది. అదియే నిజమగునేని నాపాలిటికి 'రుచిదేవి' కన్న 'తుక్కాయమ్మ' యెంతో మనోహరురాలు.

ఈగ్రంథమునందలి భాషయు గ్రామ్యవాసనాకలితముగాదు. శబ్దశాస్త్రసిద్ధము; శుద్ధము; శ్రద్ధాలోపముచేఁ గాఁబోలు పైమాట కపవాదములు తఱుచుగఁ జూపట్టెడిని. గ్రంథకర్తగారీక్రింది ప్రయోగములను మఱల నొకమాఱు పరిష్కరింతురని నమ్మెదను.

"రమణీయాతిశయము" (౧౭ పుట); "విధాయకము" ('విధి' యనునర్థమున) (౨౪); "పరకాయ ప్రవేశమాదిగాఁ గల సమస్తకలాకుశలుఁడు" (౩౪); "గోహింసాపరులగు మహమ్మదీయమారణ; మహోత్సవము" (౪౬); "కంబళీలు" (౪౬); "శ్రీమతు కర్ణాట" (౬౨); "గుణ సంపత్తు" (౬౫); "గ్రహసంపత్తు" (౬౮); "బ్రాహ్మణముతైరువ" (౮౫); "దాసీలు" (౮౫); "హిందువుఁడు" (౯౩); "అప్సరాంగన" (౧౧౧); "విశాలసుముచతురము" (౧౨౯); "స్వాంతపుస్తక భాండాగారము" (౧౮౦); "తేజస్వంతము" (౧౮౪); "భగవదంశా సంభూతుఁడు" (౧౮౫); "పవిత్రవంతములు" (౧౪౦).

(రా. అ.)

# గ్రంథపరీక్ష: "స్వామిదయానందసరస్వతి"

## వారి జీవితము, ఉపదేశములు.

నవభారతజాతీయ నిర్మాణమున ఆర్యసమాజము నేఁడొక ప్రాముఖ్యముఁగల యుత్తమస్థానము నాక్రమించుచున్నది. హనుమంతుని వృత్తాంతములేని రామాయణమువలె ఆర్యసమాజ చరిత్ర వినుపింపని భారతోదరేతిహాసమును, సమగ్రమనిపించుకొనఁజాలదు. ఇయ్యది కొన్నికొన్ని చిన్న సంస్కారములతో తృప్తినొందక మానవ జీవితముయొక్క సర్వతోముఖ సంస్కారణమునకై పూనుకొని శిథిలశిథిలములుగానున్న హిందూ సంఘమునొక పటుతరజాతిగా నిర్మింపఁజూచుచున్నది. ఇంతటి విశాలదృష్టితో నీసంఘమును నెలకొల్పిన మహనీయుని పావనచరిత్రమును, ఈ సంఘమింతవరకు నెరవేర్పఁగలిగిన కార్యజాలమును గ్రహించుటకై స్వజాతీయోద్ధరణమందు కుతూహలముగల యే యాంధ్రపుత్రుడువ్విళ్లూరకుండును? మఱియు దయానందునియొక్కయు యీ సమాజముయొక్కయు కార్యోత్సాహ తరంగమొక్కటి యాంధ్రమండలమునవీచి, సత్కార్యచరణము నంకకొంత చలనమును రేకొల్పిన యీతరుణమున ఆనందమండలి యీప్రశస్తగ్రంథమును ప్రకటించి యాంధ్రవాఙ్మయమున నొకగొప్ప కొఱఁతఁదీర్చి యాంధ్రలోకమునకు మహోపకారము గావించినది.

ఈ గ్రంథము వంగిపూడి పురుషోత్తమ శర్మగారిచే రచియింపబడినది. ఇది రెండు భాగములుగానున్నది. ప్రథమభాగమున స్వామిజీవితమును ద్వితీయభాగమున ఆయన యుపదేశములును ఆర్యసమాజ చరిత్రయు యితర గ్రంథములనుండి సేకరించి కూర్చఁబడిన యొక యనుబంధమును గలవు. ఇందలి విషయమెంత జ్ఞానదాయకమై ప్రశస్తమైయున్నదో రచనయునంతమధురమై బోధనాదాయకమైయున్నది. ఈమాదిరి రచన తెలుఁగు పుస్తకములలో నిదివఱకు లేదని చెప్పవచ్చును. ఇయ్యది మొదటినుండి

కృష్ణాజిల్లా "చిర్పర" గ్రామమునందున్న ఆనందమండలి వారిచే ప్రకటింపబడినది. వెల. రు 1—8—0.

చివరవరకు నూతనభావపూరితమై చదువరులకు తేజము కలిగించుచుండును. ఇందు గ్రంథకర్త కేవలము కథకుఁడుగానుండక తన సహజౌదార్యయుక్తమగు సూక్ష్మ విమర్శనాదృష్టితో మానవజీవితము ననుసంధించు నట్టి నైతిక సాంఘికవిషయముల నెల్ల విశదీకరించుచుండును. అందుచే పాఠకుల భావనాశక్తికి తగినంత యాహారము లభించి వారి జ్ఞానవికాసము పెంపొందఁగలదు. తొలుత నుపక్రమణికయందు భారతవర్షమునందు చిరకాలము నుండి జరుగుచున్న ధార్మిక సాంఘిక పరిణామములు సూక్ష్మముఁగను హృదయంగమముఁగను, విశేషవైపుణ్యముతోను జర్చింపఁబడి దయానందుఁడీనవయుగసంఘర్షణమున నాసిర్భవించుటకుఁగల యావశ్యకము సూచింపఁబడినది.

పిదప స్వామిబాల్యము, విద్యార్జనము, ప్రియవియోగదుఃఖము, యోగాన్వేషణము, గురుశుశ్రూష, జ్ఞానసంపత్తి, రంగప్రవేశము, శాస్త్రచర్చలు దిగ్విజయసంచారము, ఆర్యసమాజస్థాపనము, చరమదశ, మొదలగు నంశములు, విపులముఁగను, మనోరంజకముగను, చిత్రింపఁబడినవి. ఆర్యసమాజ చరిత్ర-యనగా దానిపుట్టుకనియమములు ఆసమాజము నతి సంఘసంస్కరణములందు, విద్యావ్యాపనమునందు, స్త్రీవిద్యయందు, అనాథరక్షణమునందు, జాతీయ నిర్మాణమునందుఁ గావించిన యద్భుత పరిశ్రమను ఆంధ్ర మహాజనులీగ్రంథమునుండి గ్రహించి కార్యోత్సాహమును బొందవలసియున్నారు. గురుకుల విద్యాలయమున జరుగు కార్యక్రమమంతయు నిందు వివరింపఁబడి బ్రహ్మచర్యాశ్రమము యొక్క సర్వోత్కృష్టతను, ఆవశ్యకతను, నిదర్శన పూర్వకముగా బోధించుచున్నది. మఱియు నిందు స్వామి రచించిన గ్రంథములలో నెల్ల విశేషజనానురాగమును బడసిన సత్యార్థప్రకాశముయొక్క సారము విమర్శనాసహితముగ వ్రాయఁబడి యుండుటచే నియ్యది విస్తారముగ ధర్మజ్ఞానమును బురికొల్పఁగలిగియున్నది. శైలి ధారాళమై చదువరుల హృదయముల నాకర్షించుచుండును. దీనియచ్చు కూర్పు బాగుగనేయున్నదికాని ముద్రణాస్ఖాలిత్యముల కడములేకుండినచో నిర్దుష్టమైయుండెడిది. శ్రీస్వామివారి సుందర చిత్రపటముగూడ నిందుఁ జేర్పఁబడియున్నది.

— వే. కృ.

# సముద్రతీరము

గీ. లలితకాంతుల నారికేళపు మహీజ । సంతతులడాసి చక్కిలిగింతఁగొలుప
దివ్యమగుమూర్తి ప్రణయరక్తిమముగ్రక్క । ధరపదిగుచుండు భానుడధర్మయుక్తి.

గీ. ఎంతవఱకు నాతనిముఖంబీనుచున్న । భువనమోహనకాంతులువొలయుచుండు
నంతదేశంబురాగమే యాక్రమించు । తప్పయీవలబడిన యాతండెవండో.

శా. ఆరాగంబె వెలుంగు వారినిధితోయంబందు; వీచీసహ
స్రారావంబులు కర్ణపర్వముగ వెలయఁగ, శీతవాతంబుమైఁ
దాకఁగ బెత్తముద్రిప్పికొంచుఁ బెరచింతల్ మాని, సల్లాప సం
చారంబుల్ కొనసాగఁజేతురఁట వాచాప్రౌఢిమల్ మీరఁగన్.

…చేయుటకు కొన్ని సదుపాయములను చేయతలంచి అందు …కు గాను కావలసిన రు ౩,౫౦౦ ల సొమ్ము పారిశుద్ధ్య సంఘమువారిని కోరిరి. వారందులకు సమ్మతించి గ్రంథాలయమువారు కోరిన పూర్తి మొత్తమునిచ్చిరి.

ప్రథమమున ప్రజలకు కావలసిన గ్రంథములను దేనివాల కొనుంచిరి. పిమ్మట ఈ గ్రంథములను చదువుకొనుటకు పాఠకులను పిలువసాగిరి. వారెందుకు విషయములలో నెటుల పరిశ్రమచేసినది, గ్రంథాలయ కార్యదర్శియగు "బ్లాకు మెన్" గారు న్యూయార్కు నగరములోని ఒక గ్రంథ ప్రకటన నికేతనము వారిక్రింది విధముగ వ్రాసిన యుత్తరమునుబట్టి పాఠకులు గ్రహింపగలరు.

"మా వ్యాపారమున కట్టిపెట్టి గ్రంథములు కావలయునో మొదట యోచించితిమి. మా నగరమునందు పాఠశాలలందు చదువుకొనుచున్న బాలురును యువకులును అనేకులు గలరు. వారిని ఆకర్షించుట కట్టి గ్రంథములు కావలయునో యట్టివానిని మేము కొందలకొలది, కొంటిమి. తదనంతరము మా గ్రంథముల వారికెట్టుల ఉపయుక్తమగుట యావలయునో యోచించితిమి. దీనికై గాను మా గ్రంథాలయాధిపతియు, సంఘ సభ్యులును కలిసి పురములోని ప్రతి విద్యాలయమునకును అనేక గ్రంథములను వెంటదీసికొనిపోయి, బాలురకు ఆ గ్రంథములలోనుండు విషయముల సంగ్రహముచెప్పి గ్రంథములు చదువుచుండిన గలుగు లాభముల వివరించి, మా గ్రంథములను చదువుటకు మా గ్రంథాలయమున కాహ్వానించితిమి. ఏ గ్రంథ మెవరికి కావలయునో దాను తెలియుటకు కొన్ని దరఖాస్తు నమోనాలను బాలురకిచ్చి తమకు కావలసిన గ్రంథములనందుదహరించి తమ పోషకుల సంతకములను చేయించి పంపుటకు కోరితిమి. కాని మేమిచ్చిన దరఖాస్తుఫారములలో ఒకటియైనను మాకు చేరలేదు. కొందరు పోషకుల సంతకములను చేయింపలేదు.

మరికొందరు తమ జనకుల సంతకములు దీసికొనుట కయిష్టమును సూచించిరి. అనేకమంది అటుల సంతకములు కోరుట మంచిదికాదనిరి. కొందరు పోషకులు తమబిడ్డల దరఖాస్తు ఫారములలో సంతకములు చేయనొల్లకుండిరి. అంతట సంతకముల నిర్బంధమును దొలగించి బాలురందరికిని వారి పేరు, చదువుతరగతి, పాఠశాల—ఈవివరములుమాత్రము దీసికొని గ్రంథములనిచ్చుచుండుట కేర్పాటు గావించితిమి. ఈ విషయమును బాలురకు తెలుపుటకు గాను విద్యాలయములకుబోయి వారికి చెప్పి తిరుగ వివరములకు గాను దరఖాస్తు ఫారములనిచ్చితిమి. ఆ మరుదినమునుండియు వేలకొలది బాలురు మా గ్రంథాలయమునకు వచ్చి గ్రంథముల నడుగసాగిరి. మూడవనాడు గ్రంథాలయములో నొక పుస్తకమయినను లేనందున మరికొన్ని వందల గ్రంథములను కొనవలసివచ్చినది. పుస్తకములు కొనుటకు కొలదను ఊరివారలు వెంటనే ద్రవ్యసహాయము చేసిరి. ఇటుల గ్రంథాలయములు ప్రజల నాకర్షించుటకు పనులుచేసిన ధనము ప్రోత్సాహమియు సందియము లేదు. ఇటులనే పన్నుచెల్లించువాని, కార్మికుని, వర్తకుని గృహములకు బోయి దరఖాస్తు నమోనాలనిచ్చితిమి. వారును వరదలకొలది వచ్చి గ్రంథములను దీసికొనిపోవుచున్నారు.

ప్రజలు గ్రంథములను దొంగిలింతురని మేమెన్నటికిని నమ్మజాలము. ఇంతవరకు మా నిలయములో నొక పుస్తకమయినను పోలేదు. జాగరూకతతో పనిచేసిన ప్రతిచోటనిటులనే యుండగలదని మేము నమ్మెదము. బాలురకు గూడ వారిపోషకుల సంతకములు లేకనే గ్రంథముల నిచ్చెదము. వారియందు మనకు నమ్మకముమాత్రముండిన చాలును. నమ్మకముండిన ఎంతటి ఘనకార్యమయిన చేయవచ్చును."

—ఎం. వి. ఎన్. శర్మ.

# శ్రీవీరేశలింగకవి సమాజము, కుముదవల్లి

ఈసమాజము ౧౮౯౭ సం. జూన్ ౨౭వ తేదీన స్థాపింపబడినది. ౧౯వ వార్షికోత్సవము శ్రీ రాయసం వెంకట్రామయ్యగారి యాజమాన్యమున జరుపబడినది. ఆసంవత్సర వృత్తాంతమును క్లుప్తముగా వ్రాయుచున్నాడను.

ఈవత్సరమున ౪౩ సమాజికులు గలరు. మహాజనసభలు ౧౧ ను, కార్యనిర్వాహక సభలు ౭ ను జరిగినవి. ౮౭ గ్రంథములను సామాజికులు తమగృహములకు దీసికొనిపోయి చదివిరి. స్త్రీలుమాత్రము ౧౬౦ గ్రంథములను పత్రికలను చదివిరి. ప్రతిదినమును మందిరమునకు వచ్చుపాఠకుల సంఖ్య ౧౬. మాసమాజమునకు స్వంత భవనముగలదు. ౯ పత్రికలను దెప్పించుచుంటిమి. ౩ గ్రంథమాలికలను దెప్పించుచుంటిమి. ఈవత్సరము చందాలవలన, పిరాళీములవలన, దీపావళి నిధివలన, నిలవ ఫండుతాలూకు వడ్డీవలన రు ౩౩౬-౧౧-౧ జమవచ్చినది. ఇందులో రాత్రిపాఠశాలకు, వార్తాపత్రికలకు, గ్రంథములకు, అచ్చుఖర్చులకు, అన్నవస్త్రదానములకు ఇతర ఖర్చులకు రు ౨౩౨-౯-౪ లు వ్యయమైనది. ఇదిగాక నిలవఫండు రు ౬౧౪ లు గలదు.

స్త్రీ విద్యాభివృద్ధి సమాజ ఉద్దేశములలో ముఖ్యమైనది. స్త్రీలు వారు కోరినపుస్తకములను, చందాను గ్రహింపకయే వారియిండ్లకు పంపియు, వారు బహుమతుల పరీక్షలకు జదువ దోడ్పడియు స్త్రీవిద్యను ప్రోత్సాహపరచుచుంటిమి.

నర్సాపురం తాలూకాభివృద్ధి సంఘమువారు స్త్రీలకొఱకు చేయుచున్న పరీక్షలో ఈసాలున మాచే ప్రోత్సాహింపబడి పంపబడిన బాలికలయందు ౪ గురు కృతార్థురాండ్రైరి. అందు మొదటితరగతిలో ౨ వ వారుగా జయమందిన భూపతిరాజు సూరమ్మకు భండారు అచ్చమాంబగారి పతకమును, మొదటి తరగతిలోనే ౩ వ వారుగా కృతార్థురాలైన కలిదిండి లక్ష్మీనరసమ్మకు గణితములో అల్లూరి వెంకట రమణమాంబగారి స్వర్ణపతకమును, మొదటితరగతిలోనే ౪వ వారుగా జయమందిన పెన్మెత్స లక్ష్మీనరసమ్మకు నర్సాపురం తాలూకాభివృద్ధి సంఘమువారి ఆంధ్ర వాల్మీకిరామాయణమును ఆతరగతిలోనే ౫వ వారుగా జయమొందిన సాగిసోమమ్మకు గణితములో వోసూరి నారాయణస్వామినాయుడుగారి స్వర్ణపతకమును నిచ్చిరి.

ఈసమాజము శాశ్వతముగా వర్ధిల్లుటకు, గౌరవనము వారి వట్టములకులోనై విద్యాధికుల సలహాలపయినకొంత ఆస్థి నిచ్చినవారవలన సమాజము తాలూకు ఆస్థినంతయు, అయిదుగురిను ట్రస్టీలనుగా నేర్పరచి ట్రస్టు దస్తావేజు వ్రాయబడి ది 1౩-౪ 1916 తేదిని భీమవరం సబురిజస్ట్రారువారి ఆఫీసులో నె 654 నుగా రిజిస్టరు చేయబడినది.

ఈట్రస్టు దస్తావేజు వ్రాయుటకు ముఖ్యప్రోత్సాహకులైన ఈగ్రామవాసి భూపతిరాజు బసిరాజుగారు దస్తావేజు రిజస్టరీ మున్నగు యావత్తుఖర్చులు తామే భరించి సమాజమునకు శాశ్వతమైన యేర్పాటును గావించిరి. మధ్య కొన్ని కారణములవలన నిలచిపోయిన రాత్రిపాఠశాల తిరిగి పదునాలుగు మాసముల క్రిందట నెలకొల్పబడినది. అందు ౪౦ మంది విద్యాభ్యాసమును చేయుచున్నారు.

సెప్టెంబరు ౧ తేదీనుండియు మాచే నిర్వహింపబడుచున్న ప్రార్థనాసమాజ పక్షమున ప్రతిసోమవారము సాయంకాలము ప్రార్థనాగీతములతో ఉపాసన జరుపబడుచున్నది. చందాలవలన రు ౪-౧౨-౦ లను జమకొని బీదలగు రోగుల కౌషధము నిమిత్తమిచ్చితిమి.

ఈసమాజ సభ్యులు కొందరు దీపావళిరోజున ఈ గ్రామములో యింటింటికిని తిరిగి వసూలుపరచిన సొ

